శ్రీమద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత:
శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల రు. 4-0-0. పోస్టేజి రు. 0-9-0.
ఆంధ్రగ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

# ఆంధ్రపత్రిక

తెలుగు మెఱుగులు
గ్రంథకర్త:
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- తపాలాఖర్చులు 0 7 0
ఆంధ్రగ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 243 TUESDAY 6th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# వివరాలపై ఆంధ్ర, తమిళులకు సమాధానం కుదరగానే రాష్ట్రనిర్మాణం

## భాషారాష్ట్ర నిర్మాణ విషయంలో కాంగ్రెస్ అధిష్ఠానవర్గ వైఖరిపట్ల అసంతృప్తి

### భాషా రాష్ట్రాల నిర్మాణం

#### సోషలిస్టు నాయకుని సుముఖత

కటక్, డిశంబరు 4: భాషా ప్రయుక్తంగా రాష్ట్రనిర్మాణం తనకు సమ్మతమేనని శ్రీ జయప్రకాశ్ నారాయన్ పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ అన్నారు.

"భాషాప్రయుక్త రాష్ట్ర విభజనను గూర్చి దేశంలో గందరగోళం ఎక్కువగా కనపడుతున్నది. అందువల్ల ప్రజల దృష్టికి అసలు సమస్యలు ఏమిటో కనపడకుండా పోతున్నాయి. కాబట్టి భాషాప్రయుక్తంగా రాష్ట్రాలను ఎంత త్వరలో పునర్విభజన చేస్తే, అంత త్వరగా ప్రజలకు అసలు సమస్యలు కనుపిస్తాయి" అన్నారు.

### కేంద్ర, రాష్ట్ర శాసనసభల్లోని 12 మంది కర్నాటకసభ్యుల రాజీనామా

హుబ్లి, డిశంబరు 4: కర్ణాటకరాష్ట్ర నిర్మాణం విషయంలో కాంగ్రెస్ కార్యవర్గం అశ్రద్ధ వహిస్తున్నందుకు కినుక వహించి 12 మంది కర్ణాటక రాష్ట్ర, కేంద్ర శాసనసభ్యులు రాజీనామాలు ఇచ్చారు.

కర్ణాటకరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఇవ్వాళ సమావేశమై ఈ నిర్ణయం చేసింది. దానికి అనుగుణంగా వీరంతా తమ సభ్యత్వాలను వదులుకున్నారు.

ఈ 12 మంది తమ రాజీనామాలను కర్ణాటకరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షునకు అందచేశారు. ఆయన వీటిని కేంద్ర పార్లమెంటరీబోర్డు వారికి అవసర చర్యనిమిత్తం పంపిస్తారు.

కర్ణాటక రాష్ట్రకాంగ్రెస్ ఆదేశాన్ని పురస్కరించుకొని రాజీనామా చేసిన వారిలో ఈ క్రింది వారు వున్నారు. ఎస్. నిజలింగప్ప (రాజ్యాంగ పరిషత్తు సభ్యుడు) 2. కరంత్ (3) బి. అనంతాచారి (మద్రాసు శాసనసభ్యులు) (4) కె. ఎఫ్. పాటిల్ (5) ఎస్. ఆర్. కాంతి (6) బి. డి. జట్టి (బొంబాయి ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శులు) (7) సి. జె. ఆంబ్లి (8) ఎ. జె. దొడ్‌మెట్టి (9) ఎం. హెచ్. షా (10) ఎస్. పి. గాంవ్‌కర్ (11) టి. ఆర్. నెస్వి (12) వి. వి. పాటిల్ (బొంబాయి శాసనసభ్యులు).

కాంగ్రెస్ కార్యవర్గం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఒక్కదాన్నే ఆమోదిస్తూ కర్ణాటక రాష్ట్ర ప్రశంస ఎత్తుకోక పోవడంవల్ల ఏర్పడిన పరిస్థితిని గూర్చి విచారించడానికే కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ సంఘం సమావేశమైంది.

శ్రీ ఎస్. నిజలింగప్ప సంఘ సమావేశానికి అధ్యక్షత వహించారు.

బొంబాయి వ్యవసాయ శాఖా మంత్రి శ్రీ ఎం. పి. పాటిల్, పార్లమెంటరీ కార్యదర్శులు శ్రీ కె. ఎఫ్. పాటిల్ శ్రీ ఎస్. ఆర్. కాంతి మాజీ మద్రాసు మంత్రి శ్రీ కరంత్, కొంతమంది బొంబాయి, మద్రాసు శాసన సభ్యులు, మైసూరులో జరిగిన అఖిల పక్ష సభ ప్రతినిధులు గూడా ఈ సమావేశానికి హాజరైనారు.

కాంగ్రెసు కార్యవర్గం అడిగినమేరకు కొత్త రాజ్యాంగం 26 లోపల కర్ణాటక రాష్ట్రనిర్మాణాన్ని ఆమోదించుటకు కాంగ్రెస్ కార్యవర్గం ఆమోదించడంలేదు. అందువల్ల కర్ణాటక ప్రజానీకంలో నిస్పృహా అసంతృప్తి ఎక్కువైనాయి, అని రాష్ట్ర కాంగ్రెసు

2.వ పేజి చూడుడు

## గాంధీజీ రాజకీయ యుద్ధరంగంలో కర్మ, భక్తిమార్గాల నుపదేశించారు

### గీతా సందేశమును వివరిస్తూ స్వధర్మ నిర్వహణావశ్యకతనుగూర్చి గవర్నర్ జనరల్ ప్రసంగం

న్యూఢిల్లీ, డిసెంబరు 4: శ్రీ లక్ష్మీనారాయణ దేవాలయంలో జరిగిన గీతా జయంత్యుత్సవ సందర్భంలో మాట్లాడుతూ గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు ఇల్లాగ అన్నారు. "కొందరు గీతకు అపార్థం చెబుతున్నారు. వీరు గీతలో హింస చెయ్యవలసిందని ఉన్నదని అంటున్నారు. దీని కోసమని వీరు యుద్ధరంగంలోని శ్లోకాలనే ఆధారంగా తీసుకుంటున్నారు. వీరికి ప్రథమాధ్యాయమే ప్రధానం. వెనక ముందు చూడకుండా చంపడమే శ్రీకృష్ణుని బోధలకు అర్థమని వీరు అంటున్నారు. గీతలకు ఇంతకంటె అపార్థం వేరే మరి ఒకటి లేదు. మహాభారతాంతర్గతమైన గీత మొదటి అధ్యాయం అర్జునుని విషాదంతో మొదలౌతుంది. ... ప్రారంభమౌతుంది. బంధువులు పరస్పర మారణం కోసం సన్నద్ధులై నిలబడి ఉంటారు. ఈ సందర్భంలో మానవ ధర్మ వివరణం కనపడుతుంది. గీతాచార్యుడు ఎంతో సమంజసంగా యుద్ధరంగాన్ని గీతకు పూర్వరంగంగా ఆశ్రయించారు. ... మహామహులైన వారు ... గీతలోని ఈ క్రింది శ్లోకాలను ముఖ్యంగా తమ వాదానికి ఆధారంగా తీసుకుంటున్నారు.

"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః
1. అనాశినో ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత
2. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే
3. న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యః శాశ్వతోయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే

ఈ శ్లోకాల అర్థం ఇది: ఆత్మకు నాశం లేదు. ... శరీరము చంపబడినా ఆత్మ మరణింపదు."

ఈ పిమ్మట ఇంకా ప్రాచీనమైన ఉపనిషత్తులేమి చెబుతున్నాయో చూదాము. కఠోపనిషత్తు గీతకంటె చాలాప్రాచీనమైనది. ఇందులో యముడు నచికేతునితో ఇల్లాగ అంటున్నాడు.

"న జాయతే మ్రియతే వా
విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్
అజో నిత్యః శాశ్వతో
యం పురాణో న హన్య
తే హన్యమానే శరీరే

హంతా చేన్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం
హంతి న హన్యతే."

ఒక్కని చంపవలెనని తలచినా, ఒకరిచేత హతులమాదుమని తలచినా, వార

(2.వ పేజీ చూడుడు)

## ప్రధాన మంత్రి నెహ్రూ ప్రకటన

### "నాయకత్రయ నివేదికను ఇతరులూ ఆమోదిస్తే ఆ ప్రకారం వారి రాష్ట్రాలూ ఏర్పడగలవు"

న్యూఢిల్లీ, డిసెంబరు 5: "భారత ప్రభుత్వము నాయకత్రయ నివేదికను ఆమోదించినది. ఆ నివేదకను అనుసరించే ఆంధ్రరాష్ట్రం విషయంలో కొన్ని చర్యలు తీసుకోవడం జరిగింది. ప్రస్తుతం ఆంధ్రులు, తమిళులు ఆ నిర్ణయాన్ని ఏవిధంగా అమలు జరపాలనే విషయాన్ని విచారిస్తున్నారు. వారుభయులూ వివరములపై సమాధానానికి వస్తే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో ఇంక ముందు చర్యలను వెంటనే తీసుకుంటాం" అని ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ నేడు పత్రికావిలేఖరుల గోష్ఠిలో ఒక విలేఖరి అడిగిన ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

(పండిట్ నెహ్రూ ప్రసంగం వివరాలు వేరేగా ప్రకటింపబడినవి. భాషారాష్ట్రాల నిర్మాణానికి సంబంధించిన భాగంమాత్రం యిచట ప్రచురించడమైనది.)

కేరళరాష్ట్ర నిర్మాణవిషయమై ఇటీవల ప్రధానమంత్రిని కలుసుకొన్న రాయబారవర్గం గురించి ఒకరు ప్రశ్నింపగా నెహ్రూ ఇలా అన్నారు:

కేరళ రాష్ట్ర నిర్మాణ విషయమై వచ్చిన రాయబారవర్గంవారు, నాతో కలుసుకొని మాట్లాడినారు. భాషారాష్ట్ర విభజన అన్నది మంచి విషయమే. కాని దేశం, యిప్పుడు ఇంతకంటే చాలా ప్రధానమైన సమస్యలను పరిష్కరించవలసిన పరిస్థితిలో వున్నది. ఆ ప్రధాన సమస్యలు విషయంలో ముందు శ్రద్ధ అవసరం. ఈ భాషారాష్ట్ర నిర్మాణవిషయం చెయ్యవలసి వుంటుంది.

#### ఆంధ్ర రాష్ట్రం

"ప్రభుత్వం, జె. వి. పి. నివేదికను ఆమోదించింది. ఆ నివేదికను పురస్కరించుకొని ఆంధ్రరాష్ట్ర విషయంలో కొన్ని చర్యలు తీసుకోవటం జరిగింది. దాన్ని రూపొందించే విషయం తెలుగు

(2వ పేజీ చూడుడు)

### ఇజ్రాయిల్ ప్రభుత్వ పరిగణన

#### భారత ప్రభుత్వ యోచన

కైరో, డిసెంబర్ 4:—ఈజిప్టులోని భారత రాయబారి సైజాగారు, ఇక్కడ ఒక పత్రికా విలేఖరుల గోష్ఠిలో ప్రసంగించుతూ ఇజ్రాయల్ ప్రభుత్వాన్ని గుర్తించే విషయమై భారత ప్రభుత్వం ఆలోచించుచున్నదని తెలియజేశారు.

## మన ఆర్థికస్థితి చక్కబడుతున్నదని పండిట్ నెహ్రూ ప్రకటన

### విలేఖరులతో ప్రధానమంత్రి గోష్ఠి

#### వివిధ సమస్యల పరిశీలన: పరిస్థితుల సమీక్ష

న్యూఢిల్లీ, డిశంబర్ 5: "మన ఆర్థికస్థితి క్రమేపీ చక్కబడుతున్నది. ఇంకా అభివృద్ధి చెందుతుంది. అయితే తాత్కాలికమైన యీ స్వల్ప యెగుడుదిగుడుల విషయమలా వుంచి, ఆర్థికరంగం యొక్క మూల పునాదుల దిటవు పరుచుకుని బలమైన నిర్మాణానికి పూనుకోవాలి. ఇందుకు వున్న పరిస్థితులను ముందు చక్కగా అర్థం చేసుకోవలసివుంది. అలాంటి వివరాల నన్నిటినీ సేకరించటానికి సరియైన యంత్రాగారాన్ని నియమించాలి,' అని ప్రధాని నెహ్రూ యీవేళ యిక్కడ జరిగిన పత్రికా విలేఖరుల గోష్ఠిలో వివరించారు.

ఆగ్నేయాసియా రాజ్యాలు ఫిబ్రవరిలో సమావేశం కాబోతున్నవనీ, ఆయా రాజ్యాల ప్రజాస్వామిక సార్వభౌమత యొక్క సమష్టిరక్షణవిషయమై యోజించబోతున్నాయనీ, అందులో భారతదేశం కూడా పాల్గొనబోతున్నాయనీ బర్మా ప్రధాని అన్నట్టు లండన్ పత్రికలు ఈమధ్యను ఒక వార్తను ప్రకటించినై. ఇది నిజమేనా అన్న ప్రశ్నకు సమాధానంగా ప్రధాని నెహ్రూ 'అసలా సమావేశ మేమిటో నాకేమీ తెలియదు' అన్నారు.

కడచిన జనవరిలో ఇక్కడ ఇండొనీషియా సమస్యపై విషయ సమావేశం జరిగినతరుణంలో "ఆగ్నేయాసియా రాజ్యాలన్నీ కలిసి తమకున్న సమస్యలన్నిటినీ చర్చించుకోవటానికి యిదేమాదిరిగా మరో సమావేశం జరిగితే బాగుంటుంది." అని ఒక సూచన వచ్చింది. ఫిలిప్పైయిన్సు! ఈ సమావేశం తమదేశంలో యేర్పాటు చేసుకోవలసిందిగా కోరింది. అక్కడికో ఒక్క విషయం అంతర్జాతీయంగా ... ప్రాంతీయ సమావేశం జరిగింది. ... యేర్పాటు ... అవసరం ... అన్నారు.

కొరియాలో కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశంలో యేమి చర్చించబోతారు అన్న ప్రశ్నకు సమాధానంగా నెహ్రూ ...

అసలు ఇలాంటి సమావేశాలకు నిర్దిష్టమైన చర్చా ప్రణాళిక అంటూ వుండదు. ... కామన్వెల్తు సమస్యలు ...

(2.వ పేజీ చూడుడు)

## "డా॥ రాజేంద్రప్రసాద్ ఋషితుల్యుడు, అజాత శత్రువు"

### రాష్ట్రపతి డా॥ పట్టాభి ప్రశంస

పాట్నా, డిసెంబరు 4: "డా॥ రాజేంద్రప్రసాద్ ఋషి. పండితుడు. ఆదర్శవాది. అజాతశత్రువు. నిష్కామ కర్మయోగి, మృదుభాషి, సాధుశీలుడు, మహా నిరాడంబరుడు" అని కాంగ్రెస్ మహాసభాధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యగారు నిన్న డా॥ రాజేంద్రప్రసాద్ స్వజిల్లా "సరన్" ముఖ్య పట్టణమగు చాప్రాలో రాజేంద్ర జయంతి సందర్భమున జరిగిన మహాసభలో ఉపన్యసించుచు చెప్పిరి.

గాంధీ మహాత్మునికి వారి జన్మస్థానము సమీపమున ఆగా జునాఘడ్ సంస్థానంలో స్మారక చిహ్నమును స్థాపించు సూచన విషయమై రాష్ట్రపతి ప్రస్తావించి యిట్టి స్మారక చిహ్నమును సరన్ ప్రజలు డా॥ రాజేంద్రప్రసాద్ జన్మస్థానము దగ్గర నిర్మింపవలెనని కోరిరి.

తరువాత రాష్ట్రపతి దేశములో పల్లె విరివిగా ... ప్రజలు ... మహాత్ముని ... దేశసేవలో ... కాంగ్రెస్ కర్తవ్యాన్ని చెప్పిరి.

తరువాత రాష్ట్రపతి హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ చట్టము విషయమై

## చెన్నరాష్ట్ర విభజన

### జనవరి 26 లోగాపూర్తి కావడం కష్టం

#### "నోషనల్" విభజనజరగాలని ఆంధ్రమంత్రుల భావం

మదరాసు, డిసెంబరు 5: ఆంధ్రరాష్ట్రము జనవరి 26వ తేదీన గవర్నరు జనరలు ఆజ్ఞప్రకారం వచ్చుటా రాకపోవుటా అన్నది మదరాసు మంత్రివర్గం రేపుచేయు నిర్ణయంపై ఆధారపడియున్నదని యిచట రాజకీయవర్గాలవారు భావించుచున్నారు.

రాష్ట్రనిర్మాణం జరుగులోపుసే వివరాలన్ని పరిష్కారం కావాలని ఇండియా ప్రభుత్వం హోము సెక్రటరీ పెట్టిన షరతులు అసాధ్యమయిన షరతులని ఆంధ్ర మంత్రుల సన్నిహిత వర్గాలవారు తెల్పుచున్నారు.

ఆంధ్ర రాజధాని మధురజిల్లాలో రామ్నాడు జిల్లాకలక్టరు కచేరీలున్నట్లు మదరాసులో నుంచుకోవచ్చునని తమిళ నాయకులు తెల్పుచున్నారు. అవడిలో నుంచుకోవచ్చుని కొందరభిప్రాయం తెలిపిరి. అవడినుండి ఆంధ్రరాష్ట్ర సరిహద్దు ప్రారంభమగుచో ఆవిషయం కూడ ఆలోచించదగునని ఆంధ్ర పెద్దలంటున్నారు.

చన్నపట్నం వదలు కోవడం అశాస్యము ... ఆంధ్రులు ... ఒప్పుకున్నా కూడా, కేంద్రం నిర్ణయానికి విభజన జరిగి మదరాసు విడిచి పోవాలనడం, అట్టి అప్పుల విభజన వివరాలన్ని యిప్పుడే తేలాలని హోమ్‌సెక్రటరీ కార్యదర్శి ఆయ్యంగారు వ్రాసి పంపుట ధర్మాన్ని కోరవలెను, కొంతకాలం సంబంధం రాష్ట్రాల విభజన ఆంధ్ర తమిళ విభజనలు మద్దతించిరి, అని పాక్షికంగా చేసి ఇండియా ప్రభుత్వం క్రింద సంపాదించి, ఆంధ్ర రాష్ట్రము ... కేంద్రప్రభుత్వం చేసిన యీ సర్వే ... అల్పకాలంలో ... జరిగియుండునని, ఈసూచన ప్రకారం జనవరి 26 తేదీలోగా ఆంధ్రరాష్ట్రము ... తరువాత కేంద్ర కార్యవర్గంద్వారా రావలెనని ... ఆంధ్ర మంత్రులు భావించుచున్నట్లు తెలియుచున్నది.

ప్రాంతీయ గాలా జనాభాను బట్టి విభజన నిష్పత్తిని నిర్ణయించి, ఆంధ్ర తమిళ నాయకుల ఒప్పందం జరిగినచో, ఆ ప్రకారం విభజనకార్యం వెంటనే ప్రారంభించవచ్చునని, కోరిక నడుపుతున్నారు ... వనీ కార్యదర్శులు అభిప్రాయపడు చున్నారు.

కేంద్రప్రభుత్వం హోంసూక్ష్మ కార్యదర్శి సూచించిన ప్రకారం విభజన సూత్ర ప్రాయంగా యుక్తపరచి, తరువాత విభజన ఖచ్చితంగా చేయుట మంచిదని ఆంధ్ర మంత్రులభిప్రాయపడుచున్నారు.

మదరాసు మంత్రివర్గంవారు రేపు యీ విషయంలో ఒక కమిటీని నియమించి దానికి విచారణకు ఒక పథకము చెప్పనున్నారు.

కేంద్రప్రభుత్వలేఖ ప్రకారం రాష్ట్రం విభజన చేయనట్లు జనవరి 26 లోగా, ఆంధ్రరాష్ట్రం ఏర్పడదని ప్రశ్నకు ... ఆంధ్రమంత్రులు అభిప్రాయపడుతున్నారు ... పట్టు తెలియచున్నది ... ఆంధ్ర మంత్రుల కేంద్రప్రభుత్వం ఆంధ్ర ప్రభుత్వం ఏర్పాటు ... కొంత ... ఆంధ్ర నాయకులు అభిప్రాయపడు చున్నారు.

## ఆకివీడులో చికిత్సా కేంద్రము

### కలకత్తా వైద్యదళపు కార్యక్రమము

విజయవాడ, డిసెంబరు 3: కలకత్తా మార్వారీ సహాయ సంఘమువారు తుపాను ప్రాంతములో పనిచేయుటకుగాను పంపిన వైద్యదళము డిశంబరు 5 న ఆకివీడు వెళ్లి, అచట తమ చికిత్సా కేంద్రమును నెలకొల్పుతారని తెలియవచ్చింది.

నేడు కృష్ణావరద తుపాను బాధితుల సహాయసంఘ సభ్యులైన కాశేశ్వరరావు, డా॥ టి. వి. యస్. చలపతిరావు, వి. కృష్ణయ్య, వైద్యదళము వారితో వైద్య సహాయావశ్యకతలపై సంభాషించి, వారికి విజయవాడలో కృష్ణా బుడమేరు వరదల వలన తుపానువలన నష్టపడిన ప్రాంతములను చూపిరి.

ఆకివీడు, కొల్లేరు సమీప గ్రామము, వరదవలన తీవ్రముగా దెబ్బతినిన పల్లపు ప్రాంతము. తుపాను తర్వాత ఇచట నీరు అత్యధికముగా నిలచిపోయినది. అసలే దోమలకు పుట్టినిల్లయిన కొల్లేటి ప్రాంతములో, ఇట్లు చాలాకాలము నీరు నిలుచుట ఆరోగ్యమునకు దెబ్బ. అందువలన చికిత్సాకేంద్రము ఆకివీడులోననే యుండుట ఉచితమని నిర్ణయింపబడినది.

## తిరుపతిలో పశువుల ఆస్పత్రులు

తిరుపతి, నవంబరు 30: తిరుపతిలో పశువులకు క్రొత్తగా ఆస్పత్రి ఎవరైనా ప్రారంభించేసినఎడల వారికి ప్రారంభ ఖర్చులలోను, ప్రతిసంవత్సరం నడుపుటకు అయ్యే ఖర్చులలోను ప్రభుత్వంవారు ...% ఇస్తారని ఇదివరలో తెలియజేశారు. అది ప్రస్తుతం ఇచ్చుటకు వీలు లేదనీ, అందుచేత పశువులకు క్రొత్తగా ఆస్పత్రులు ప్రారంభించే విషయం కొంతకాలంవరకు నిలిపివేయవలసి యున్నదనీ, మద్రాసు ప్రభుత్వంవారు ఒక ఉత్తర్వును పంపియున్నారు. (స్వ. వి.)

## హిందూపురం ఫిర్కా అభివృద్ధి సంఘం

హిందూపురం, నవంబరు 30: ఈ ఫిర్కా అభివృద్ధిసంఘము ఈ నెల 27 వ తేదీన చౌళూరు గ్రామములో జిల్లా కలెక్టరు వివేకానందమూర్తిగారి అధ్యక్షతను సమావేశమయినది. ఫిర్కా అభివృద్ధి అధికారి డి. సూర్యనారాయణరావుగారు ఇంతవరకు జరిగిన కార్యక్రమ నివేదికను చదివిరి. ఫిర్కా అభివృద్ధి ప్రణాళిక వలన చౌళూరు గ్రామమునకు చాల లాభము గల్గినదని చెప్పుచూ మరుగుదొడ్లు, త్రాగు నీటి బావులు, రోడ్లు తదితర సదుపాయములు గలుగ చేయబడుటయేకాక, ఒక ఆసుపత్రి, గ్రంథాలయము, బీద విద్యార్థులకై ఉచిత భోజనాలయము తెరువబడినవని చెప్పిరి.

సంఘమువారు ఒక తీర్మానముచేస్తూ ప్రభుత్వము రాయలసీమకు ఇవ్వదలచిన ఆరు ప్రాతిపదిక విద్యల కర్మాగారమును ఈ ఫిర్కాలోకెల్ల పెద్దదైన లేపాక్షి గ్రామములో స్థాపించవలయునని కోరిరి. తదుపరి అనంతపురం జిల్లాబోర్డు అధ్యక్షులు కె. వి. వేమారెడ్డిగారు అభివృద్ధి సంఘమునకు సభ్యులుగా నియమింపబడిరి.

సమావేశానంతరం కమ్యూనిటీ సెంటరుకును, ఎల్. ఎఫ్. డిస్పెన్సరీకిని వివేకానందమూర్తిగారు శంకుస్థాపన గావించిరి. ఒక్కొక్కదానికి రు 10000/- కావలసియుండునని అంచనా వేయబడినది. ప్రభుత్వం వారు కమ్యూనిటీ సెంటరుకై 5000 రూ., ఎల్. ఎఫ్. చికిత్సాలయమునకై జిల్లాబోర్డువారు 5000 రూ. మంజూరు చేసియున్నారు. ఈ రెంటికిని అగు ఖర్చులో తాము సగము భరించెదమని చౌళూరు వాస్తవ్యులు కె. సంజీవరెడ్డిగారు వాగ్దానము చేసిరి. జిల్లా కలెక్టరుగారును, తదితరులును సంజీవరెడ్డిగారి ఔదార్యమును కొనియాడిరి. (స్వ. వి.)

## ఇద్దరు కమ్యూనిస్టుల అరెస్టు

పొన్నూరు, డిసెంబరు 3: జూపూడి కమ్యూనిస్టు దాడి కేసులోను, వరిమెరు కోసిన కేసులోను, పోలీసులకు చిక్కనీక, తప్పించుకొని తిరుగుతున్న గొల్ల ...కయ్య, పులిపాటి కోటయ్య అను కమ్యూనిస్టులను, జూపూడి పోలీసు సబిన్స్పెక్టరు మాణిక్యాలరావుగారి సహాయంతో, ఇన్స్పెక్టరు కె. చంద్రమౌళిగారు, 1 వ తేదీ రాత్రి, మన్నవలో అరెస్టు గావించారు. (స్వ. వి.)

## తిరువాంకూరు-కొచ్చిన్

చెన్నపట్నం, డిశంబరు 5: తిరువాంకూరు-కొచ్చిన్ సంస్థానములోని యూనియన్ ప్రాంతములు ఇండియన్ యూనియన్‌లోని సంస్థాన ప్రాంతములు గూర్చి సంస్థానమంత్రి ఇక్కంవారియర్ గారు రేపు ఢిల్లీనుండి మద్రాసు ప్రధానితో చర్చింతురు.

## దక్షిణ విశాఖ జిల్లా కాంగ్రెసు ఎన్నికలు

### అధ్యక్షులుగా పసుమర్తి వీరభద్రస్వామిగారి ఎన్నిక

విజయనగరం, డిశంబర్ 2: దక్షిణ విశాఖజిల్లా కాంగ్రెసు సర్వసభ్య సమావేశం నేడు ఇక్కడ బొడ్డువారి సత్రములో జరిగింది. సభకు వి. జె. గుప్తాగారు అధ్యక్షత వహించారు. జిల్లా కాంగ్రెసు సభ్యులు 149 మందికీ 121 మంది సభ్యులు హాజరు అయారు.

సభ ప్రారంభించగానే, జిల్లా కాంగ్రెసు కార్యాలయాన్ని విశాఖపట్నంలో వుంచాలని ఒక తీర్మానాన్ని కోరుకొండ సుబ్బరాజుగారు ప్రతిపాదించారు. నూతన కార్యవర్గ ఎన్నికలు జరిపే ముందుగా, గత సంవత్సరకే జిల్లా కాంగ్రెసు తాలూకు జమాఖర్చుల వివరాలు సభ్యులకు తెలియపరచాలనీ బీసెట్టి అప్పారావుగారు కోరారు. అందుకు సభాధ్యక్షులు లేచి, ప్రస్తుత సర్వసభ్య సమావేశం ఒక్క ఎన్నికలు జరుపుటకు మాత్రమే ప్రత్యేకించబడిందువలనే ఏ ఇతర తీర్మానాలూ ప్రతిపాదించుటకు అవకాశంలేదని అన్నారు.

తరువాత సంఘ అధ్యక్షపదవికి పసుమర్తి వీరభద్రస్వామిగార్ని జి. బుచ్చి అప్పారావుగారు ప్రతిపాదించారు. కొల్లూరి వీరభద్రరావుగార్ని అట్లు జోగి నాయుడుగారు ప్రతిపాదించారు. ఓటింగు బేలటుద్వారా జరుపబడింది. ఓట్లు లెక్కించగా పసుమర్తి వీరభద్రస్వామిగారికి 79 వోట్లూ, కొల్లూరి వీరభద్రరావుగారికి 40 వోట్లూ వచ్చి, వీరభద్రస్వామిగారు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించబడింది.”

ఓటింగు సందర్భంలో జయపురం నివాసి అయిన అంగజాల వెంకటేశంగారి సభ్యత్వంగురించి కొంత చర్చ జరిగింది. వారు జయపురంవాసి అయినా ఆ ప్రాంతాలు మన జిల్లా కాంగ్రెసులో చేర్చుకున్నారు. కాబట్టి వారు ఓటింగుకి అర్హులని అధ్యక్షులు రూలింగు ఇచ్చారు.

వీరభద్రస్వామిగారు ఎన్నిక అనంతరం సభ్యులను అభినందిస్తూ తమను ఎన్నుకున్నందుకు కృతజ్ఞత తెలియచేశారు. ముందు ముందు గ్రామ పంచాయతీలను ఎన్నుకోవటం జరుగుతుంది. కాబట్టి, తాలూకాల్లోని కాంగ్రెసు సభ్యులంతా ఇప్పటినుంచీ కృషి చేయాలని అన్నారు.

అనంతరం నూతన కార్యవర్గం ఎన్నుకొనబడింది. మిస్సుల సూర్యనారాయణగారిని, ప్రధాన కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. ఈ క్రింది సభ్యులను కార్యవర్గంగా ఎన్నుకున్నారు. ఎస్. నరసింహమూర్తి, జి. బి. అప్పారావు, కె. పాపయ్య, బి. అప్పలనాయుడు, ఎం. ఎ. రెడ్డి, అంగజాల వెంకటేశం, జి. అప్పలనాయుడు, ఎం. జగన్నాధరావు, కె. నారాయణ, టి. వెంకటరమణయ్య, ఆర్. జగన్నాధరావు, బి. గంగయ్యనాయుడు, ఎస్. విజయ రామారావు.

## బరంపురంకాలేజీ ఆంధ్ర విద్యార్థి సంఘ వార్షికోత్సవాలు

బరంపురం, నవంబరు 28: బరంపురం కాలేజీ ఆంధ్ర విద్యార్థిసంఘ వార్షికోత్సవాలు నిన్న, మొన్న యిచ్చట పురమందిరంలోను, కాలేజీహాలులోను జరిగినవి. మొదటిరోజున వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్ర సారస్వతాన్ని గూర్చి, సారస్వతంయొక్క ప్రయోజనాన్ని గూర్చి, తెలుగు యువతీ యువకుల బాధ్యతలనుగూర్చి ఉపన్యసించారు. విద్యార్థి సంఘాధ్యక్షుడు టి. వి. కుమారగుప్త అధ్యక్షత వహించెను. విద్యార్థి సంఘంవారు జరిపిన పోటీలలో బహుమతులు శ్రీ సత్యనారాయణశాస్త్రిగారి చేత యిప్పించారు. 27 వ తేదీ ఉదయం కాలేజీహాలులో, విఖ్యాత వాయులీన వాద్య ప్రవీణ మారెళ్ళ కేశవరావుగారికి సన్మానం జరిపి, వారి కొక సన్మానపత్రం, శాలువా సమర్పించారు. కేశవరావుగారు కొంతసేపు వయొలిన్ వాయించారు. సాయంకాలం టవునుహాలులో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు “మన సారస్వతం” అనే శీర్షికను తీసుకొని, ప్రాచీన కవులలో వున్న ప్రాశస్త్యం, అసలు తెలుగు కవిత్వంలోని మాధుర్యం గురించి ప్రసంగించారు. వేదుల సత్యనారాయణశాస్త్రిగారధ్యక్షత వహించారు. ఈ ఉదయం శ్రీమతి బతుల కామాక్షమ్మగారు, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు ఆంధ్ర విజ్ఞానమిత్రమండలి వారు నడుపుతున్న పఠనాలయం, గ్రంథాలయం దర్శించి, వారు చేస్తున్న కృషిని ప్రశంసించిరి. తర్వాత వారిద్దరు స్థానిక సిటీ హైస్కూలును దర్శించిరి.

గౌ. మంత్రి శ్రీ భక్తవత్సలంగారు తుపాను నష్టాన్ని తెలుసుకొనుటకు రాజమండ్రి రాగా పురప్రముఖులు సన్మానం చేసిన దృశ్యం

# తూర్పు గోదావరి జిల్లాలో రెండవపంటకు నీటిసరఫరా

## రైతులందరకు న్యాయం కలిగేటట్లు చూస్తామని భక్తవత్సలంగారిహామీ

రాజమహేంద్రవరం, డిశంబరు 4: తూర్పుగోదావరి జిల్లాలోని భూములకు రెండవపంటకు నీరు సప్లయి చేయు విషయమై రైతులతోను, జిల్లాలోని ఆఫీసర్లు, యం. యల్. ఏలు మున్నగు వారితోను సంప్రదించు నిమిత్తం మద్రాసు పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి యం. భక్తవత్సలంగారు నిన్న ఉదయం మెయిలులో యిచ్చట దిగి ధవళేశ్వరం గ్రామానికి వెళ్ళిరి. శాసనసభ డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్న రాజాగారు కూడ వీరితో వచ్చిరి. భక్తవత్సలంగారిచ్చటకు రాగానే పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ కె. యల్. నరసింహారావు, కార్యదర్శి దూడ వీరాస్వామిరెడ్డి, తూ. గో. జిల్లాబోర్డు అధ్యక్షులు మారిన నరసన్న, గొవ్విడి లింగరాజు (యం. యల్. ఏ) జిల్లాకలెక్టరు బాలసుందరంగార్లు యింకాపలువురు అధికార అనధికార ప్రముఖులు వారికి స్వాగతమిచ్చిరి.

మధ్యాహ్నం మూడుగంటలకు ధవళేశ్వరంలో జిల్లారైతుల సమావేశం జరిగింది. పి. డబ్ల్యు. డి. ఛీఫ్ ఇంజనీర్ పి. వెంకటరమణరాజుగారు రెండవపంటకు అన్ని భూములకు నీరు సప్లయి చేయలేక పోవుటకు గల కారణములను గురించి చెప్పుచూ గోదావరిలోని నీరు ఎంతవరకు సరిపోయిన అంతవరకు యీయగలమని, అది ఏ ప్రాంతముల వారికిచ్చిన బాగుండునో రైతులు, ప్రభుత్వము ఆలోచించవలెననీ చెప్పిరి. తర్వాత మంత్రిగారి కోరికపై ఒక్కొక్క తాలూకాకు యిద్దరు రైతు ప్రతినిధుల చొప్పున జిల్లాలో తుపాను వరదల దెబ్బతిన్న అన్ని తాలూకాల వారు రెండవ పంటకు నీరు యిచ్చు విషయమై తమ అభిప్రాయములు తెలియజేసిరి. వీరిలో తుపాను, వరదల దెబ్బతిన్న ప్రాంతముల వారు మాట్లాడుచూ యీ ఘోర విపత్తులో నున్న ప్రజలను రక్షించుటకై తుపాను, వరదల వల్ల నష్టము పొందని భూములకు రెండవ పంటకు నీరు యీయరాదనీ, దెబ్బతిన్న ప్రాంతములకే నీరు అందజేసి అచ్చటి ప్రజలకు జీవనాధారము కల్పించవలెననీ కోరిరి. ఇతర ప్రాంతముల వారు మాట్లాడుచూ దెబ్బతిన్న భూములకు తిరిగి నీరు యిచ్చినా ఎకరమునకు ఏ నాలుగు అయిదు బస్తాల ధాన్యమో పండును కాని అంతకన్న ఎక్కువ పండదనీ, ఆమాత్రం దానికి ఎకరానికి పాతిక బస్తాలు పండు భూములకు నీరు అందచేయక పోవుట మంచిది కాదనీ తెల్పి మామూలుగా యివ్వవలసిన భూములకు మాత్రం నీరు యిచ్చివేసి వీలైతే దెబ్బతిన్న ప్రాంతములకు కూడ నీరు అంద జేయుటకు ప్రభుత్వము ప్రయత్నించవలెననిరి.

పిమ్మట మంత్రి భక్తవత్సలం గారు ప్రసంగించుచూ తాము యీ దెబ్బ తిన్న ప్రాంతాలలో పర్యటించక పోయినా యిచ్చటచేరిన రైతులు చెప్పు విషయాల్ని బట్టి తుపానునష్టాలు ఎంత అధికంగా వున్నవో తాము వూహించుకొనగల్గితిమనీ ప్రజల సౌఖ్యంకోసం ప్రభుత్వం ఎట్టి చర్యలు తీసికొనడానికైనా సంసిద్ధంగా నున్నదనీ తెల్పిరి. ఈ కష్టకాలసమయంలో ఒకరికొకరు సహకరించుకొనుటకు బదులు మాకు నీరు కావాలంటే మాకు కావాలని పంతులాడుకొనుట విచారకరమనీ, వీలైనంతవరకూ అందర్నీ సంతృప్తిపరచుటకే ప్రభుత్వం యత్నించును గాని అది ఒకొక్కప్పుడు సాధ్యపడక పోవచ్చుననీ చెప్పి జిల్లాలోని ప్రముఖులతోను, అధికార్లతోనుకూడ యీ విషయమై సంప్రదించి పక్షపాతం లేకుండా అందరికీ న్యాయం జరిగేటట్లు చూస్తామని మంత్రి గారు హామీయిచ్చిరి.

సమావేశానంతరం మంత్రి భక్తవత్సలంగారు జిల్లా అధికార్లతోను, శాసనసభ్యులతోను కూడిన ప్రత్యేక సమావేశములో వారితో చర్చలు జరిపి రెండవ పంటకు యేయే భూములకు నీరు సప్లయి చేయవలెను అను విషయమై వారి అభిప్రాయములు స్వీకరించిరి త్వరలో యీ విషయమై ప్రభుత్వము తుదినిర్ణయము చేయునని తెలియుచున్నది. (స్వ. వి.)

## ప్రభుత్వ ఉద్యోగములు: కులముల నమోదు

చెన్నపట్నం, డిసెంబరు 5: ప్రభుత్వ ఉద్యోగములకు సాధ్యమైనంత వరకు కులముల పేర్లు నమోదు చేయకుండా ఉంచవలెననియు, వీటి విషయమై నిర్ణయము ఆయా రాష్ట్రముల విచక్షణకు వదలివేయవలెనన్నట్లు తెలిపినట్లు మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి తెలిపిరి. నూతన భారత రాజ్యాంగ చట్టము ననుసరించి వెనుకబడిన జాతుల భవిష్యత్తు నిర్ణయమునకు ఒక సంఘము నియమింపబడనున్నదనియు, వారి కార్యమును దివాకర్ కమిటీవారే ముందు పూర్తి చేయదలచలేదనిరి. మద్రాసు అసంబ్లీలో మద్రాసు ప్రభుత్వ వైఖరినిగూర్చి సభానాయకులు సమాధానమిచ్చుచూ ప్రభుత్వ చర్యవల్ల కులములు మాసిపోగలవను మాటనుమద్రాసు ప్రభుత్వము నమ్ముటలేదనిరి. మద్రాసు ప్రభుత్వవైఖరి అంతియేనని ప్రధాన కార్యదర్శి తెలిపిరి.

## పుంగనూరు తాలూకా కాంగ్రెస్ సమావేశం

### అధిక సౌకర్యాలను కలిగించాలని ప్రభుత్వానికి విన్నపం

పుంగనూరు, డిసెంబరు 2: పుంగనూరు తాలూకా కాంగ్రెసు సంఘ సర్వసమావేశం నవంబరు 27 వ తేదీన జి. నాగయ్యగారి అధ్యక్షత క్రింద జరిగింది.

ఈ తాలూకాలో ఒక పశువుల ఆస్పత్రిని ఏర్పాటు చెయ్యాలని, గృహనిర్మాణ సహకార సంఘ బ్యాంకిని సాధ్యమైనంత త్వరలో స్థాపించాలని జిల్లా కో-ఆపరేటివ్ రిజిస్ట్రారును కోరుతూ వారు తీర్మానించారు.

పుంగనూరు బోర్డు హైస్కూలులో గదులు ఎక్కువ కట్టించాలనీ, చౌడేపల్లి లోని బోర్డు హైయర్ ఎలిమెంటరీ స్కూలును హైస్కూలుగా మార్చాలనీ, కురుదు చీమనపల్లి, నాకిరేపల్లి గ్రామాల్లో స్కూలుభవనములున్నవి కనుక అక్కడ ఉపాధ్యాయులను నియమించాలనీ, పుంగనూరులో తపాలాసౌకర్యా లధికం చేయించాలనీ, ఈ తాలూకాకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కలిగించాలనీ, ప్రభుత్వాన్ని కోరుతూ కొన్ని తీర్మానాలు చేశారు.

ఉత్తరసర్కారులలో తుపాను, వరద బాధితుల సహాయార్థం విరాళములు ప్రోగుచేయుట కొరకు సంఘ మేర్పాటు చేయబడింది.

## ఇండియాకు జపానుచక్రవర్తి కానుకలు

న్యూఢిల్లీ, డిసెంబరు 4: జపానునుండి వచ్చిన పారిశ్రామిక ప్రవీణులద్వారా జపాను చక్రవర్తి ఇండియా గవర్నరు జనరలు సి. రాజగోపాలాచారికి రాజలాంఛనాలుగల వెండిపాత్రా, నెహ్రూ పటేలులకు రాజుగారి సంతకంగల రెండు చిత్ర సంపుటాలూ పంపారు.

# విశాఖపట్నం నౌకా నిర్మాణశాలను కొనసాగించడానికి ప్రభుత్వకృషి

## సింధియా కంపెనీకి ధనసహాయంచేసేసూచన

విశాఖపట్నం, డిసెంబరు 4: విశాఖపట్నంలోని నౌకానిర్మాణశాలను తక్షణమే మూసివేసే ఆలోచనకు, దానిని సంపూర్ణంగా పనిచేసే స్థితిలో వుంచటానికి మధ్యేమార్గంగా సింధియా కంపెనీవారొక క్రొత్త ఆలోచన చేస్తున్నారని తెలిసింది.

కంపెనీ ప్రధాన మేనేజరు పాండ్యగారితోను, భారతప్రభుత్వ ఉద్యోగం నుండి ఈ కంపెనీలో మూడేళ్ళపాటు పనిచేయటానికి వచ్చిన ఎస్. దండేకర్ గారితోను ఆంధ్రపత్రిక విలేఖరి సంభాషించగా కొన్ని వివరములు బయటపడినవి. దండేకర్ గారు వ్యయకర్తన విధానాలను గూర్చి ప్రస్తుతం ఆలోచిస్తున్నారు. ఇప్పటికే 3 వందల రూ. లకు పైబడిన జీతం గలవారి విషయములో జీతం తగ్గింపు అమలుపరచబడినది. ఇది ఉద్యోగస్థుల యిష్టానుసారమే జరిగిందని పాండ్యగారు చెప్పారు. ఇక 3 వందల రూ. లకు తక్కువ జీతం గలవారిజీతం తగ్గింపు విషయమై మధ్యవర్తిత్వం నెరపవలసిందని సింధియావారు భారత ప్రభుత్వాన్ని కోరారు.

ఈనెల 6 వ తేదీన చతుర్థనౌకా జలప్రవేశం పూర్తిఅయిన తర్వాత నిర్మాణశాల యిదివరకనుకున్నట్లుగా మూసివేయబడటంలేదు. భారతప్రభుత్వం ప్రస్తుతం ఈ శాలను వశపరచుకొనటం కష్టం గనుక నౌకాపరిశ్రమ ఆగిపోకుండా చూసే నిమిత్తం కొన్ని ప్రత్యామ్నాయ సహాయ మార్గాలను అన్వేషిస్తున్నదనీ, తాను ప్రభుత్వానికి అనేక మార్గాలను సూచించాననీ దండేకర్ గారు తెలిపారు. నిర్మాణశాల మూసివేయబడితే అది కార్మికులకూ దేశానికికూడ ప్రమాదకరమని చెప్పుతూ శాలలోని పరిస్థితులనుగూర్చి వ్యయకర్తన పద్ధతులనుగూర్చి భారతప్రభుత్వం చెయ్యవలసిన ప్రత్యామ్నాయ సహాయములనుగూర్చి తాను ప్రభుత్వానికొక నివేదిక పంపానని ఆయన అన్నారు. అయితే వాటన్నిటినీ ఇప్పుడు తాను వెల్లడించలేనన్నారు.

ప్రస్తుత క్లిష్ట పరిస్థితిలో కార్మికులు తమ బాధ్యతను గుర్తించి దేశంతోను, యజమానులతోను సహకరించాలనీ కార్మికులు కూడా యీ పరిస్థితికి తగినట్లుగా త్యాగబుద్ధి చూపిస్తే నౌకా పరిశ్రమ నడవటానికి సావకాశం ఏర్పడుతుందనీ దండేకర్ చెప్పారు. ప్రభుత్వ నిర్ణయాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, ఈ సమస్యను వివిధ దృక్కోణాల నుండి పరిశీలించవలసివుందనీ, నౌకా పరిశ్రమను స్వాధీనం చేసుకొని అధిక నష్టాలను భరిస్తూ దానిని సాగించటమూ, లేక దానిని పూర్తిగా విసర్జించటమూ, అనే విషయాలను, ఈ పరిశ్రమను ఏ రీతిగా ఆదుకోవాలీ అన్న సమస్యను కేంద్రప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలిస్తుందనీ అయన అన్నారు.

నిర్మాణశాలలోని 5 భాగాలలోను నిత్యమూ నిర్మాణకలాపం జరుగుతూ వుండకపోతే ఈ పరిశ్రమ అట్టే లాభించదనీ, అసలు సింధియావారే ఈ పరిశ్రమను తాత్కాలికంగా సాగించటానికొక మార్గాన్ని కనిపెట్టటం జరగవచ్చునీ దండేకర్ తెలిపారు. దండేకర్‌ను మూడేళ్ళపాటు నిర్మాణశాల నిర్వహణకు పంపటంలోనే భారత ప్రభుత్వం యీ సమస్యా పరిష్కారంపట్ల శ్రద్ధ వహించి వున్నదని స్పష్టపడుతున్నది. (స్వ. వి.)

# హిందీ భాషేతరులకు జాతీయ భాషనభ్యసించుటకు సౌకర్యాలు

## ప్రభుత్వవిధానం: విద్యామంత్రి ఆజాద్ వివరణ

### దేశీయ భాషలన్నింటిలో సామాన్యంగా ఉన్న ‘హిందీ’ పదాల సేకరణకు ప్రయత్నం

మైసూరు, డిసెంబరు 4: భారత దేశంలోని వివిధభాషలలోను సాధారణంగా వ్యవహారంలో ఉన్న సర్వభాషా సామాన్యపదాలను కూర్చడానికి తగిన వ్యవస్థనొకదానిని త్వరలో నెలకొల్పవలెనని భారతప్రభుత్వం సంకల్పించినట్లుగా విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థ అధ్వర్యాన ఇక్కడ జరుగుతున్న గోష్ఠిలో ఈవేళ వెల్లడి అయింది. సమావేశానికి భారత ప్రభుత్వ విద్యాశాఖా మంత్రి మౌలానా ఆజాద్ పంపిన ఒక సందేశంలో ఈమాట వ్రాసిఉన్నది. విద్యాశాఖామంత్రి కార్యభారంవల్ల సమావేశానికి తానుగా రాలేకపోయినాడని చెప్పి భారతప్రభుత్వ విద్యాశాఖా కార్యదర్శి డా॥ తారాచంద్ ఆయన పంపిన సందేశమును చదివి వినిపించెను.

సందేశపాఠం ఈ రీతిగా వుంది:— హిందీకి ఆయాదేశీయ భాషలకు సామాన్యంగా ఉన్న పదాలు అన్నిటినీ ఏరి పోగుచేయాలని నాకు కొంతకాలంగా ఆలోచన వున్నది. హిందీకి భిన్నమైన భాషలవారు కూడా అనేక హిందీపదాలు నిత్యకృత్యంగా వాడుక చేస్తున్నారని, ఈ సేకరణమూలంగా విస్పష్టం కాగలదని నా విశ్వాసం. ప్రతివ్యక్తి తాను మామూలుగా వాడే హిందీ పదాలకు తోడు వివిధభాషలకు సామాన్యమైన మరికొన్ని హిందీ పదాలను కూడా నేర్చుకొని ప్రయోగించ నారంభించనట్లయితే, త్వరలోనే ఒక మాదిరిగా హిందీ మాట్లాడడం అభ్యాసం అవుతుంది. కాబట్టి ముందుగా వివిధ భాషలకు సామాన్యమైన పదాలను సేకరించి, హిందీభాషేతరులకొరకు ఒక క్రమమైన పద్ధతిలో హిందీభాషాబోధినులను రచించి ఇవ్వాలని నా ఉద్దేశం.

మీరుచేసిన ప్రతి సిఫార్సును శ్రద్ధగా పరిశీలించి సాధ్యమైనంత త్వరగా వీలైనంత మేరకు అమలు జరపడానికి భారత ప్రభుత్వం ప్రయత్నించగలదు.”

వివిధ ఉపసంఘాలు చేసినకృషి గూర్చి ప్రస్తావిస్తూ, మౌలానా ఆజాద్ ఇట్లు వ్రాసెను:— “వయోజనులకు చదువు వ్రాయను నేర్పడం ఎలాగు అన్న విషయంలో మొదటి ఉపసంఘం చాలా అమూల్యమైన సూచనలు చేసింది. కుటుంబంయొక్క ఆరోగ్యం, కుటుంబజీవితం గురించి రెండవ సంఘం చేసిన సిఫార్సులు సాంఘిక జీవనాభివృద్ధికి చాలా లాభకారిగా కనిపిస్తున్నవి.

స్త్రీలకు గృహనిర్వహణ గురించి కుటుంబారోగ్యరక్షణ గురించి శిక్షణ ఇవ్వవలసిన ఆవశ్యకతను ఈ ఉపసంఘం నొక్కివక్కాణించినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఎందుచేతనంటే కుటుంబజీవితం సుఖప్రదంగాను ఆరోగ్యవంతంగాను లేకపోతే, ఏ సమాజమూ అభివృద్ధి చెందలేదు.

గ్రామసీమలలోని వయోజనులకు విద్యాబోధన చేయడంలో ఉన్న చిక్కులను తీసుకొని వాటిని తీర్చడం ఎలాగో మూడవ సంఘం సూచించింది.

పోస్టర్లు, చిత్రాలు తయారుచేయించి వయోజనులను క్లాసులకు ఆకర్షించాలనీ, ఈ ప్రచార చిత్రములను రచించడంలో విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంఘం సాయంతీసుకోవచ్చుననీ వీరుచేసిన సూచనలు ఆచరణయోగ్యాలుగా కనిపిస్తున్నవి.

గ్రామీణానికి సమాజంలోను దేశంలోను గల ప్రాధాన్యాన్నిగురించీ, అది వహించవలసిన పాత్రగురించి నాలుగవ సంఘం నివేదిక తయారుచేసింది.

సమావేశం సూచించిన కార్యక్రమాన్ని నిర్వహించడంలో చేసిన పనే చేసి అనవసర వ్యయప్రయాసలు తగలకుండా చూడడానికి కేంద్రంలో ఒక సంఘాన్ని నియమించాలని కమిటీ చేసిన సూచనతో నేను ఏకీభవిస్తున్నాను.

విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థ సూచించిన మార్గాలలో వయోజన విద్యాబోధన సాగించడం ఒక్కటే అంతర్జాతీయ శాంతిరక్షణకు పరమమైన సాధనో పాయమని ప్రపంచంఅంతా ఈనాడు విశ్వసిస్తున్నది. బొమ్మలు, పోస్టర్లు, పటాలు, బయస్కోపులద్వారా సామాజిక విద్యను కూలంకషంగా కరపడానికి విద్యా వైజ్ఞానిక సాంస్కృతికసంఘం అధ్వర్యమున వివిధ దేశములలోను గట్టిప్రయత్నం జరగగలదని విశ్వసిస్తున్నాను.

చిత్రములు అనేవి భాషలవలెగాక మానవజాతికంతకు సార్వజనీనంగా అర్థం అవుతవి. ఈ సార్వజనీన భాషద్వారా సామాజిక విద్యాబోధన చేయడానికి అపారమైన అవకాశాలు ఉన్నవి.

ఇప్పుడు జరుపుతున్న ఈ అఖిల ఆసియా విద్యావేత్తల గోష్ఠితోబాటు వివిధదేశములలోను ప్రాంతీయ గోష్ఠులు కూడా జరపాలని కమిటీ చేసిన సూచనను నేను ఆమోదిస్తున్నాను. విదేశములనుండి వచ్చిన ప్రతినిధులకు ఏమీలోటు జరగలేదనీ, అన్యోన్యమూ లాభకరమైన స్నేహాలు కుదుర్చుకోగలిగారనీ విశ్వసిస్తున్నాను.”

డా॥ తారాచంద్ ఉపన్యసిస్తూ, భారత దేశంలో పన్నెండు, పదహారేళ్ళ మధ్య 12½ కోట్లమంది నిరక్షరాస్యులు ఉన్నారనీ, వీరికందరికి విద్యాబోధన చేయడం ఎంత బృహత్కార్యమో ఈ సంఖ్యే సూచిస్తున్నదనీ, అనిరి.

“అజ్ఞానం నిరక్షరాస్యత చాలా ప్రమాదకరమైనవి. వయోజన వోటింగుహక్కు త్వరలోనే అమలులోకి రాబోతున్నది. శాసనసభ్యులను నాయకులను ఎన్నుకొనవలసిన బాధ్యత అప్పుడు ఈ నిరక్షరాస్యులమీదనే పడుతుంది. దేశభవిష్యత్తును నిర్ణయించవలసినవారు అక్షరజ్ఞాన శూన్యులై ఉండడం విపరీతం కాదా? అందుచేత నిరక్షరాస్యతను నిర్మూలించడమే మన ప్రథమ కర్తవ్యం.”

సమావేశానికి నాయకత్వం వహించిన థాయిలాండ్ ప్రతినిధి మోమ్ లువాంగ్ మాలకుల్ భారత ప్రభుత్వానికి నివేదికను సమర్పించెను. ఈ నివేదికలో వివిధ ఉపసంఘాలు చేసిన సూచనలు క్రోడీకరించి పొందుపరచబడినవి. మోమ్ లువాంగ్ మాలకుల్ నివేదికలో ఈ విధంగా ఉపోద్ఘాత వాక్యాలు వ్రాసెను:—

“మేము ఈ సమావేశం జరిగిన నాలుగు రోజులూ అంతర్జాతీయ వాతావరణంలో అంతర్జాతీయ సౌభ్రాత్రంతో అన్యోన్యంగా వెళ్లదీశాము. ప్రపంచంఅంతా ఈ వరవడిగా ప్రవర్తించినట్లయితే, శాంతి సౌఖ్యాలకు అనతికాలంలోనే ఆలవాలం అవుతుందనడానికి సందేహంలేదు. మన ముందున్న పని చాలా బృహత్తరమైనది; ప్రభుత్వాలయు, ప్రభుత్వేతర సంస్థలయు వత్తాసుతో ఏళ్ల తరబడిగా కృషిచేస్తేగాని కృతకృత్యులం కాలేము. కాని విద్య నేర్పవలసిన ప్రజానీకం సంఖ్య ఎన్నికోట్లలో ఉన్నా సమస్య ఎంత గహనంగా కనిపించినా, మేము సూచించిన పద్ధతిన కార్యక్రమం సాగించినట్లయితే, క్రమక్రమంగా నిరక్షరాస్యత నిర్మూలమై పోగలదనటలో సందేహంలేదు. సమస్యా పరిష్కారానికి అనుసరించవలసిన మార్గాలు ఈ నివేదికలో విస్పష్టంగా నిర్దేశించబడినవి.” సమావేశాన్ని జయప్రదంగా ముగించినందుకు విద్యా వైజ్ఞానిక సాంస్కృతికసంస్థ డైరెక్టరు జనరలు థోర్రెస్ బోడెట్ సభ్యులను అభినందిస్తూ ఒక సందేశం పంపెను.

భారతప్రధాని పండిట్ నెహ్రూ సమావేశానికి ఈ క్రింది విధంగా సందేశం పంపెను: “వయోజన విద్యా సమస్యలను గూర్చి చర్చించడానికి 19 దేశాల ప్రతినిధులు ఒకచోట ఇక్కడ కూడడం చాలా ముదావహమైన విషయం. ఈ గోష్ఠి వల్ల సత్ఫలితాలు చేకూరగలవని నా నమ్మిక.” ప్రతినిధులకు పరిశీలకులకు అభినందనలు తెలిపి ఆయన ఈవిధంగా వ్రాసెను: “అమెరికానుండి ఇటీవలనే తిరిగివచ్చినందువల్ల కార్యభారంతో నాకు తీరిక లేకుండా ఉన్నది. ఆశించిన ప్రకారం సమావేశానికి రాలేకపోయినందుకు విచారిస్తున్నాను.”

సమావేశం నేటితో పరిసమాప్తమైంది. ఐక్యరాజ్యసమితి విద్యా వైజ్ఞానిక సాంస్కృతికసంస్థ ఆయా నివేదిక లన్నిటినీ క్రోడీకరించి సమన్వయపరచి సభ్యదేశాలన్నిటికీ ఒక సమగ్రమైన నివేదికను దరిమిలాను అందజేయగలదు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 5:

బంగారు – వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-క ఎడ్వర్డు బొమ్మ సేల్ప్టాడ్ప్రోవహా రు. 77-0-0 పెట్లా బంగారు తులం 116-4-0 మూసబంగారు 118-4-0 సీమవెండి తులం 100-క (రెడీ) 173-0-0 వెండి తులం 1 క 1-12-6

## జలంధర్ కాందిశీక శిబిరంలో ముస్లింలు

### ఖర్చు విషయమై ఇండియా పాకిస్థాన్‌ల వివాదం

న్యూఢిల్లీ, డిసెంబర్ 4: పాకిస్థాన్ వెళ్ళటంకోసం నిరీక్షిస్తూ జలంధర్ కాందిశీక శిబిరంలో చాలాకాలంనుంచీ ఉన్న 5 వేల మంది ముస్లిం కాందిశీకులు పాకిస్థాన్‌లోకి రావటానికి ఆ ప్రభుత్వం అనుమతించటంలేదని తెలియవచ్చినది. యీ ముస్లిములలో, చాలమంది మతం మార్చబడినవారు, ఇండియాకు వచ్చి వ్యవహారాలను చూసుకుని పాకిస్థాన్‌లో ఉన్న కుటుంబాలను కలుసుకొన ప్రయత్నిస్తున్న వాళ్ళూ ఉన్నారు.

లాహోర్ కాందిశీక శిబిరంలోనూ, కరాచీ శిబిరంలోనూ ఉన్న కొలకొద్దీ ముస్లిమేతరులను తాము భరిస్తున్నట్లే ఈ శిబిరంలోని ముస్లింల పోషణ భారాన్ని మీరు వహించాలని భారత ప్రభుత్వం పాకిస్థాన్ ప్రభుత్వాన్ని కోరగా ఆ ప్రభుత్వం దానికి నిరాకరించటమే కాక కాందిశీకులను తన దేశంలోనికి రానివ్వటానికికూడ నిరాకరించింది.

రెండురోజులకిందట, పాకిస్థాన్ ప్రభుత్వం ఒక ప్రకటనచేస్తూ "పాకిస్థాన్‌కు వచ్చే 'భారత దేశీయులు' అందరూ పర్మిట్టులేనిదే పాకిస్థాన్‌లోకి ప్రవేశిస్తే చాల కష్టపడవలసి వస్తుంది. వాళ్ళను పాకిస్థాన్‌లోపలికి ఎన్నటికీ అనుమతించము" అని స్పష్టపరచింది.

జలంధర్‌లోని పాకిస్థాన్ డిప్యూటీ హైకమిషనర్ కిందిఉద్యోగులు కొన్ని లారీలలో కాందరు కాందిశీకులను ఢిల్లీ తీసుకువచ్చి మీరువచ్చిన చోట్లకు వెళ్ళిపొండని వదిలివేశారు. ఇక్కడ ఉండవలచుకున్న వాళ్లను ఉంచటానికే ఇండియా సిద్ధంగా ఉన్నది. ఇండియాలో స్థిరపడాలని అనుకుంటున్న వారికి పర్మిట్లు ఇవ్వటానికి కూడా ఇండియా సిద్ధపడిఉన్నది. యు. ప్రె.

## సౌదీ అరేబియాలో పాకిస్తాను వారి దుష్ప్రచారం

లక్నో, డిసెంబరు 4: పాకిస్తాను వారు కరాచీలో ప్రచురించబడే రెండు అరబ్బీ పత్రికలలో ఇండియాకు విరుద్ధంగా దుష్ప్రచారం ప్రచురించి సౌదీ అరేబియాలో ఆ పత్రికలనుచితంగా పంచుతూ ఉన్నట్లు యు. పి. విద్యాశాఖామంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి అయిన మౌలానా మహఫుజుర్రహమాన్ పత్రికా విలేఖరులతో అన్నారు.

ఈయన హాజ్ యాత్రార్థం బయలుదేరి 3 నెలలు సౌదీ అరేబియాలో పర్యటించారు. ఇండియాలో కష్టాలు పడిన ముస్లిము స్త్రీల ద్వారా కూడా దుష్ప్రచారం సాగించ బడుతున్నదనీ, వారు తమను భారతీయ ముస్లిం స్త్రీలుగా పేర్కొని "ఘోర కష్టాలను" గురించి యాత్రికులతో చెబుతున్నారనీ కూడా ఆయన తెలిపారు.

కాని పాకిస్తాను సాగించే ఈ దుష్ప్రచారం సౌదీ అరేబియా ప్రభుత్వానికి ఎక్కలేదట. అక్కడివారు ఇండియాతో సత్సంబంధాలు వాంఛిస్తున్నారట. సౌదీ అరేబియా సుల్తాను జమాయతుల్ ఉలేమా హింద్ రాయబారవర్గానికి దర్శనం ఇచ్చి స్నేహపూర్వకంగా మాట్లాడారట.

హాజ్ యాత్రార్థం వెళ్లిన భారతీయ యాత్రికులకు ఇతర దేశాలవారితో సరి సమానంగా సౌకర్యాలు కలిగించబడినవనీ, ఇస్లామిస్తాను ఏర్పాటుచేయడం గురించి మధ్యప్రాచ్యంవారి అభిప్రాయాలు తెలుసుకొనడానికి ఆమధ్య పాకిస్తాను ముస్లిములీగు అధ్యక్షుడు చౌధరిఖాలిక్‌జ్జమాన్ చేసిన పర్యటన సౌదీఅరేబియావారిని ఆకర్షించలేదనీ, మధ్యప్రాచ్యంవారు కోరేది ఆర్థిక సంబంధాలేగాని మత సంబంధాలు కావనీ మౌలానా అన్నారు.

## టారిఫ్‌బోర్డు రహస్య సమావేశం

బొంబాయి, డిసెంబరు 3: భారత ప్రభుత్వ వ్యవసాయ శాఖాధికారులతోనూ, యు. పి., బీహారు, బొంబాయి, మైసూరు ప్రభుత్వాల ప్రతినిధులతోనూ, కోయంబత్తూరులోని చెరకు ప్రవీణుడు వందలాలు దస్తుతోనూ నేడు టారిఫ్ బోర్డువారు రహస్య చర్చలు జరిపారు. పంచదార పరిశ్రమకు రక్షణ సాగించడంగురించీ, పంచదార సిండికేటు భవిష్యంగురించీ, చెరకు ఉత్పత్తి, పరిశోధనలనిమిత్తమై అఖిల భారతసంస్థ ఏర్పరచడంగురించీ, పంచదార ఉత్పత్తి విక్రయాలనుగురించీ, జులై ఆగస్టులలో ఏర్పడినపంచదార ప్రతిష్టంభన గురించీ, పంచదార దిగుమతుల విధానం గురించీ చర్చలు జరిగినట్లు తెలుస్తున్నది.

సోమవారంనాడు టారిఫ్ బోర్డువారు ఇండియా ప్రభుత్వ వ్యవసాయ కమిషనరు ఆర్. ఎల్. సెథీ, షుగర్ టెక్నాలజిస్టు పరిశ్రమనుగురించి భారతప్రభుత్వ పరిశ్రమల సప్లయిశాఖలోని మిశ్రానూ పరీక్షిస్తారు.

# "నిర్బంధశాసనాలు అమలు జరపటం ప్రభుత్వానికి సరదా కాదు"

## శాంతిని భగ్నంచేసేవారి నణచవలసిందే నని మంత్రి సంజీవరెడ్డిగారి వివరణ

### కృష్ణా జిల్లాలో మద్యనిషేధ మంత్రి పర్యటన

బందరు, డిసెంబరు 3: నిన్న ఉదయం మద్రాసు ప్రభుత్వ మద్యనిషేధశాఖామంత్రి సంజీవరెడ్డిగారు, స్థానికాధికారులూ కాంగ్రెసు ప్రముఖులతో కలసి ముదినేపల్లినుండి బయలుదేరి, వడాలి, పెదతుమ్మిడిగ్రామములమీదుగా కైకలూరు తాలూకావెళ్లి అక్కడ మురుగునీటిపారుదల పరిస్థితులను పంట పరిస్థితులనూ పరిశీలించి బందరుతాలూకా వచ్చారు. ఈ తాలూకాలో బంటుమిల్లినుండి పెడన వరకు మూలమట్టముగా కూలిపోయిన గ్రామాలు, పగిలిపోయిన వంతెనలు, వరద ముంపుచే ఆరురోజులలో మహాసముద్రమైపోయిన రోడ్డుకిరుప్రక్కలావున్న పంట భూములు పరిశీలించారు. అక్కడక్కడ భూములలో వరికంకులు తెప్పించి పంట పరిస్థితి చూచారు. ప్రజలకు ఓదార్పు మాటలు చెప్పారు.

పెడనలో భోజనము విశ్రాంతి అనంతరము బోర్డుహైస్కూలులో స్థానిక కాంగ్రెసుసంఘము, పంచాయితీబోర్డు, చేనేత కాంగ్రెసుయిచ్చిన సన్మాన పత్రములు స్వీకరించారు.

అనంతరం సముద్రతీర ప్రాంతములైన తవిశిపూడి, తాళ్లపాలెం జొన్నలవారి మోడిగ్రామములు వెళ్లి అక్కడి పరిస్థితులు పరిశీలించారు. ఆ ప్రాంతీయ ప్రజల యిక్కట్లు వాని నివారణోపాయాలు రిటైర్డు జిల్లా వ్యవసాయ శాఖాధికారి కానుకొల్లు గురుమూర్తిగారు మంత్రిగారికి ఎరిగించారు.

### బందరుపార్కులో ఫలహారశాల శంకుస్థాపన

బందరుపార్కులో ఈవరకే రేడియో, పిల్లల ఆట పరికరాలు, పడవ షికారుకు అనువైన కాలువ డింగీ, వేమూరివారి దానమైన శ్రీ రామకృష్ణారావు గ్రంథాలయము ఏర్పాటు చేయబడియున్నవి. ఇప్పుడొక ఫలహారశాల కొరకు ప్లాటుఫారము కట్టారు. ఆ ఫలహారశాలకు సంజీవరెడ్డిగారు నిన్న సాయంకాలం శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భమున పురపాలకసంఘము మంత్రిగారికి సన్మాన పత్రము సమర్పించారు. పట్టణ కాంగ్రెసు సంఘము మరొక సన్మాన పత్రము సమర్పించింది.

అనంతరము జరిగిన బహిరంగసభకు శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించారు. చిన్నకోట వెంకటస్వామి నాయుడుగారు మద్యపాన నిషేధశాసనము అమలు జరపుటలో కొన్ని సూచనలు చేశారు.

సంజీవరెడ్డిగారు ప్రసంగిస్తూ మారాయలసీమ వారికి క్షామమంటే తెల్సునుగాని తుపాను తెలయదన్నారు. అట్టి తాను తుపానుసమయములో గుంటూరులో చిక్కుపడటం సంభవించిందనీ యీతుపాను వల్ల అపారనష్టం సంభవించిందనీ అన్నారు. కోట్లకొలదిగా కలిగిన యీ నష్టమును ఏ ప్రభుత్వమూ పూడ్చలేదనీ, ప్రజా సహాయానికి 4 లక్షలిచ్చామంటే ప్రభుత్వానికి యిదే పెద్ద మొత్తంగా వుందనీ, ఇతర రాష్ట్రాలనుండి క్షామనిధి వస్తున్నదనీ, వానితో తాము చేయతగిన సాయము చేస్తామనీ, అన్నారు. ప్రజలే ధైర్యంతో తమ కాళ్ళమీద తాము నిలబడుటకు ప్రయత్నించవలెనన్నారు. 17 కోట్లు వదలుకొని మద్యనిషేధం, 18 కోట్లు నష్టంతో జమీందారీ రద్దు శాసనం అమలు జరుపుటతో దేశములోకల్లా అగ్రతాంబూలం పుచ్చుకున్నామన్నారు. వాని అమలులో లోపాలున్నాయని తమకు తెలియుననీ ప్రజలు మనస్ఫూర్తిగా సహకరిస్తేనే శాసనాలు సక్రమంగా అమలు జరుగ గలవనీ అన్నారు.

30 కోట్లనష్టం వల్ల రాష్ట్రబడ్జెటు సరిపెట్టవంతి కనుక అవుతున్నదనీ, క్రొత్త పన్నులు వేయక తప్పదనీ, వానిని ప్రజలు సంతోషంతో యివ్వాలనీ అన్నారు.

ప్రభుత్వంపై ఆలోచన లేని విమర్శ ఎక్కువగా వుందనీ, దానిని అరికట్టాలనీ, మన నాయకులపై విశ్వాసముంచి 10 ఏండ్లపాటు ఓపిక పట్టితే దేశము సర్వతోముఖంగా అభివృద్ధి పొందగలదనీ అన్నారు. అందుకుగాను నిరంతర కృషి జరుగుచున్నదన్నారు.

ప్రజల అసంతృప్తినీ, నిస్పృహనూ రెచ్చగొట్టేశక్తులు దేశంలో వున్నాయన్నారు. హింసాత్మక ప్రయోగం చేస్తూంటే జైలులో వేస్తేస్వాతంత్ర్య భంగమంటారు. నిర్బంధశాసనాలు అమలుజరపటం ప్రభుత్వానికి సరదా కాదు. శాంతియుతంగా తమసిద్ధాంత ప్రచారానికీ, నిర్మాణాత్మక విమర్శకూ, ఎన్నికలలో పోటీచేసి తద్వారా ప్రభుత్వపంథానే మార్చటానికీ, ప్రతివారికీ హక్కుంది. అంతేకాని "మేము తలలు బ్రద్దలు కొట్టుతాము. ఇది మా పంథా" అని అంటే ప్రజాసామాన్యం క్షేమందృష్ట్యా అట్టివార్ని అణచవలసిందే. ఏండ్ల తరబడిగా పోరాడి బ్రిటిష్‌వారినుండి సంపాదించిన స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనకుండా అంటకట్టుతామంటే సహించజాలము. కాబట్టి ప్రజలు కనుగలిగి మెలగుతూ విద్రోహకశక్తులను తావీయక ప్రభుత్వ కార్యక్రమాలలో చేయూతనిస్తూ అవసరమైనచోట నిర్మాణాత్మకవిమర్శ చేస్తూ భారతభాగ్యాభివృద్ధికి అండగా నిలువవలెను." అని సంజీవరెడ్డిగారన్నారు.

రాత్రికి డా॥ అచ్యుతరామయ్యగారి ఆతిథ్యమును స్వీకరించి మంత్రిగారు బందరులో విశ్రాంతి తీసుకున్నారు.

(స్వ. వి.)

## మలయాలో భారత ప్రభుత్వ ఏజెంట్

### ప్రత్యేకాధికారం రద్దుకు ప్రయత్నం

సింగపూరు, డిసెంబరు 3: మలయాలో భారతీయ కార్మికుల స్థితిగతులను దర్యాప్తు చేయుటకు అక్కడి భారత ప్రభుత్వ ఏజెంటుకున్న ప్రత్యేకాధికారాలను రద్దు చేయుటకు మలయా ప్రభుత్వం సంకల్పించింది. ఇందునిమిత్తం, మలయా ఫెడరల్ శాసనసభ యీసారి సమావేశమవగానే ఒక బిల్లు ప్రతిపాదింపబడునని బ్రిటిషుపత్రిక 'స్ట్రెయిట్ టైమ్స్' కౌలాలంపూర్ విలేఖరి వ్రాస్తున్నాడు.

మలయాకు భారత కార్మికుల వలసను ప్రోత్సహించేనిమిత్తం యీ ప్రత్యేకాధికారాలను యిచ్చుటకు అంగీకరిస్తూ భారత ప్రభుత్వం, మలయా ప్రభుత్వం యిదివరలో ఒడంబడిక చేసుకొన్నదని 1938 లో భారతీయవలస నిషేధింపబడుటచే అప్పటినుంచీ యీ ఒడంబడిక రద్దయినదని మలయన్ అటార్నీ జనరల్ తెలియజేశాడు.

## ప. బెంగాల్ వ్యవహారాలు

### కాంగ్రెస్ కార్యవర్గ జోక్యం

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: కాంగ్రెస్ కార్యవర్గం పశ్చిమ బెంగాల్ వ్యవహారాల్లో జోక్యం కలిగించుకున్నట్లు కనిపిస్తున్నది. అక్కడి రెండు పక్షాల కాంగ్రెసు వాళ్లూ సమాధాన పడనందువల్ల, ప్రాథమిక సభ్యులను చేర్చుకొనటం, కాంగ్రెసు సంఘాల ఎన్నిక పద్ధతులను గురించి కార్యవర్గం ఒక ఉత్తరువు పంపినట్లు తెలుస్తున్నది.

రాష్ట్ర కాంగ్రెసు సంఘం నియమ విరుద్ధంగా కొత్త సభ్యులను చేర్చటానికి ఎడ్‌హాక్ కమిటీలను ఏర్పరచినదని రాష్ట్ర కాంగ్రెసులోని మంత్రి వర్గపు ముఠా వారు కొందరు నిన్న కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి ఫిర్యాదు చేశారు.

నేడు రాష్ట్ర కాంగ్రెస్‌లోని రెండవ ముఠా తరఫున రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి చారు చంద్ర భండారీ ప్రభృతులు కాంగ్రెస్ కార్యదర్శుల నిద్దరినీ కలుసుకొని కొత్త సభ్యులను చేర్చుకొనటానికి డిసెంబర్ 15వ తేదీ వరకూ గడువివ్వవలసిందని కోరారు. మంత్రి వర్గపు ముఠా వాళ్లు కోరటం వల్ల అధిష్టాన వర్గం గడువును డిసెంబర్ 1 నుంచి 7 వరకూ పెంచినది. (యు. ప్రె.)

## నేపాల్ మహారాజాకు బ్రిటిష్‌ప్రభుత్వ గౌరవం

రాక్సువాల్, డిసెంబరు 3: ఖాట్మండులోని బ్రిటిష్ రాయబారి యివ్వాళ ప్రత్యేకం దర్బార్ ఉత్సవం యేర్పాటు చేసి, నేపాల్ మహారాజాకు, బ్రిటిష్ సైన్యంలోని లెఫ్టినెంట్ జనరల్ అనే బిరుదును తన ప్రభుత్వం తరఫున సమర్పించాడు. బ్రిటిష్ ప్రభుత్వం చేసే ఉన్నత గౌరవానికి చిహ్నంగా నేపాల్ మహారాజుకు ఒక ఖడ్గాన్ని గూడా బహూకరించాడు.

ఈ దర్బార్ ఉత్సవంలో, భారత హైకమీషనర్, ఆస్ట్రేలియా హైకమీషనర్ పాల్గొన్నారు.

## "డాలరు మారకం ధర రహస్యంగా తగ్గించబడదు"

### బొంబాయిలో వాల్టర్ లిప్మన్ అభిభాషణ

బొంబాయి, డిసెంబరు 3: ప్రసిద్ధ అమెరికా విలేఖరి ఇక్కడ పత్రికా విలేఖరులతో మాటలాడుతూ, సర్ స్టాఫర్డ్ క్రిప్స్ స్టెర్లింగు మారకం విలువ తగ్గదని అనేకసార్లు అభయం ఇచ్చిఉండిన కారణంచేత, అధ్యక్షుడు ట్రూమన్ తన హయాంలో డాలరుకు బంగారానికి మధ్య ఉండే మారకంరేటు తగ్గదని చెప్పినప్పటికీ అనేకమంది నమ్మలేకుండా ఉన్నారనీ, నిజానికి డాలరు మారకం ధర తగ్గించే అధికారం ట్రూమనుకు లేదనీ, అటువంటిపని జరగవలసివస్తే శాసనసభలో అనేకవారాలపాటు చర్చ జరుగుతుందనీ, వినుక రూజువెల్టు డాలరు మారకం విలువ మార్చినప్పుడు అధ్యక్షుడికుండిన హక్కులు ఉపసంహరించబడినవనీ తెలిపారు.

## చంద్రనగర్ అప్పగింత

చంద్రనగర్, డిసెంబరు 3: చంద్రనగర్ అప్పగింతవిషయమై పార్లమెంటులో డా॥ బి.వి. కేస్కార్ ఇటీవలచేసిన ప్రకటనగూర్చి చంద్రనగర్ పరిపాలనా నిర్వాహకుడు ఎమ్. మైలూర్ ఈ విధంగా వ్యాఖ్యానించెను:

"ఫ్రెంచి వలస శాఖామంత్రి, చంద్రనగర్ అప్పగింతకుగాను ఒక ఒడంబడిక తయారుచేసి, భారతప్రభుత్వం అభిప్రాయార్థమై దానిని అక్టోబరు 6వ తేదీనపంపెను. సమాధానం వ్రాయవలసిందని ఇటీవల ఒక హెచ్చరికకూడా పంపినా భారతప్రభుత్వం వద్దనుంచి ఇంతవరకు ప్రత్యుత్తరమే రాలేదు."

## కస్తూరిబా గాంధీ నిధి

### ఈ సంవత్సరానికి 16 లక్షలుపైగా ఖర్చు చేయాలని నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 3: కస్తూరిబా గాంధీ నిధి ధర్మకర్తలంతా నవంబరు 30న ఇక్కడ సమావేశమై 1950 వ సంవత్సరానికి 16 లక్షల 35 వేల 773 రూపాయలు ఖర్చు పెట్టాలని తీర్మానించారు. ఈ ధనంఅంతా గ్రామసేవికల శిక్షణానికి, మంత్రసానులకు, ప్రాథమిక పూర్వ ప్రాథమిక విద్యాశిక్షణాలకు ఖర్చు పెడతారనీ, 96 ప్రసూతి గృహాలకుకూడా కొంత సహాయం చేస్తారనీ, ఒక కుష్ఠరోగుల ఆస్పత్రికూడా నిర్మిస్తారనీ తెలుస్తున్నది.

తరువాత ఈ ధర్మకర్తల సంఘంవారు సింధు స్త్రీలకు, పిల్లలకు సహాయం చెయ్యడానికి 46 వేలు ఖర్చు పెట్టాలని కూడా తీర్మానించారు.

సర్దార్ పటేల్ ఈ సభకు అధ్యక్షత వహించారు. సంఘసభ్యులైన జి. డి. బిర్లా, దేవదాస్ గాంధీ, ప్రభృతులుకూడా ఈ సమావేశానికి హాజరైనారు.

## ఐక్య కేరళ రాష్ట్రం: నెహ్రూ అభిప్రాయం

న్యూఢిల్లీ, డిసెంబరు 3: ఐక్య కేరళ రాయబార వర్గానికి పండిట్ నెహ్రూ ఈ విధంగా సమాధాన మిచ్చెనని రాయబార వర్గ కార్యదర్శి కె. ఏ. దామోదరమీనన్ తెలియజేసెను:—

"కేరళరాష్ట్ర నిర్మాణం సుకరము వాంఛనీయము అనుటలో సంశయంలేదు. రాష్ట్రం తప్పకుండా ఏర్పాటు చేయబడుతుంది. కాని మా దృష్టిని. ఇప్పుడు అసలు సమస్యలమీదనుంచి పెడగా తిప్పడానికి ప్రయత్నించవద్దు. ఎంత వాంఛనీయమైన పనైనా అదను వస్తేనేగాని చేయడానికి వీలుండదు." రాయబారవర్గం జగ్జీవన్‌రామ్, మౌలానా అబుల్‌కలాం ఆజాద్ గారలను కూడా కలుసుకొనెను.

## "జరుసలేంలో విదేశీ పరిపాలన వీలులేదు"

### బహిరంగసభలో తీర్మానం

టెలవివ్, డిసెంబరు 3: నేడు జరుసలేంలో పెద్ద బహిరంగసభ జరిగి, "ఇజ్రేలు ప్రధాననగరంలో ఎవరుగాని విదేశీ పరిపాలన సాగించజాలరు," అని తీర్మానించబడింది.

జరుసలేంలో అంతర్జాతీయ పరిపాలన ఏర్పాటుచేయడంగురించి ఐక్యరాజ్య సమితి చర్చించుచుండగా పై తీర్మానం జరిగింది.

బహిరంగసభలో ప్రధాన రబీ, జెరుసలేం మేయరు మొదలైనవారు మాట్లాడారు.

జరుసలేం పౌరులు అంతర్జాతీయ పరిపాలన ఆమోదించరని ఐక్యరాజ్య సమితికి తెలుపవలసినదిగా ఇజ్రేలు విదేశాంగ మంత్రికి తంతి పంపడానికి తీర్మానం జరిగింది.

## యూరోపియన్ కాందిశీక పునరావాసం

### హైకమిషనర్ కార్యాలయ స్థాపనకు సమితినిర్ణయం

ఫ్లషింగ్ మెడో, డిసెంబరు 3: అంతర్జాతీయ కాందిశీక పునరావాస సంస్థ 1951 ఏప్రిల్‌తో అంతమవుతుంది గాన ఆ సంస్థచేయగా మిగిలిన పనులను పూర్తి చేయుటకు హైకమీషనర్ కార్యాలయాన్నొకదానిని నెలకొల్పుటకు ఐక్యరాజ్య సమితి నేడు నిర్ణయించింది.

ఈ నిర్ణయానికి అనుకూలంగా 35 ఓట్లు 7 ఓట్లు ప్రతికూలంగాను వచ్చినవి. 13 గురు సభ్యులు ఓటింగ్‌లో పాల్గొనలేదు. రెండవ ప్రపంచయుద్ధంలో నిర్వాసితులైన యూరోపియన్లకు న్యాయశాస్త్రరీత్యా తగిన రక్షణ యివ్వడమే యీ హైకమీషనర్ కార్యాలయ ప్రధాన కర్తవ్యం.

ఐక్యరాజ్యసమితి ప్రతిపాదనను రష్యా యుగోస్లావియాల తోపాటు పాకిస్థాన్ గూడా ప్రతిఘటించింది.

యూరోపియను నేతరులైన కాందిశీకుల విషయంకూడా స్మరించాలని పాకిస్థాన్ వాదించింది.

## తార్పుకాళ్లపైన జనరల్ అసెంబ్లీ ఆంక్ష

ఫ్లషింగు మెడో, డిసెంబరు 3: పడుపు వృత్తిని వ్యాపారంగా పెట్టుకొని ధనార్జన చేసే తార్పుకాళ్ళను, ఈ పని నిర్వహించే సంస్థలను న్యాయబాహ్యులనుగా జనరల్ అసెంబ్లీ ఈవేళ ప్రకటించింది.

పడుపువృత్తిపరించిన అంతర్జాతీయ ఒడంబడిక ఈవేళ 35 వోట్లతో ఆమోదింపబడింది. 15 గురు తాటస్థ్యం వహించిరి. బ్రిటన్, ఫ్రాన్సులు ప్రతిఘటించిరని, లోగడ ఈ విషయమై జరిగిన అంతర్జాతీయ ఒడంబడికలన్నీ ఈ కొత్త ఒడంబడికలో క్రోడీకరించబడినవి.

## అక్రమ ప్రదర్శనం జరిపినందుకు 21 మంది అరెస్టు

సెలం, డిసెంబర్ 4: నవంబర్ 26వ తేదీన నామక్కల్ గ్రామంలో అక్రమ ప్రదర్శనం జరిపినందుకుగాను పోలీసులు ఇప్పటికి 21 మందిని అరెస్టుచేశారు. ప్రదర్శనమీద ఆనాడు పోలీసులు కాల్పులుకూడా జరపవలసి వచ్చింది. ఇప్పుడు గ్రామం శాంతంగానే ఉన్నది.

నామక్కల్ సేలం పట్టణానికి 30 మైళ్ల దూరాన ఉన్నది.

## ఆంధ్ర అభ్యుదయ వారోత్సవాలు

### గుంటూరు హిందూ కళాశాల విద్యార్థుల ఏర్పాటు

గుంటూరు, డిసెంబరు 2: గుంటూరు హిందూకాలేజి విద్యార్థులు నవంబరు 27 వ తారీఖునుండి నిన్న సాయంకాలం వరకు ఆంధ్ర అభ్యుదయ వారోత్సవాలు జరిపారు. కాలేజి ఆవరణ అంతయు యీ వారంరోజులు సంపులకూడిన ప్రజా సమూహముతో నిండిపోయెను. సాయంత్రం నిత్యము ఉపన్యాసములు రాత్రిళ్లు నాటకప్రదర్శనములు ప్రతిరోజు రెండు పర్యాయములు ప్రత్యేకముగా యీ వారోత్సవ సందర్భములలో దంతయ్య పంతులు హాలులో విద్యా వైజ్ఞానిక చలన చిత్రప్రదర్శనములు, చిత్రకళా ప్రదర్శనములు ఏర్పాటుచేయబడినవి.

నవంబరు 27 సాయంత్రం శతావధాని, మహోపధ్యాయ మహశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారిచే ప్రారంభింపబడిన యీ సభలు నిన్న సాయంత్రం డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులగారి అంతోపన్యాసముతో ముగిసినవి. ఈ ఉత్సవములలో అనేకమంది ఆంధ్ర ప్రముఖులు పాల్గొన్నారు.

శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు గుమ్మడిదల వెంకటసుబ్బారావుగారు, చిట్టా బాలకృష్ణశాస్త్రి వల్లభజోస్యుల సుబ్బారావు పర్వతనేని వీరయ్యచౌదరి, బర్దార్ కనకలింగేశ్వరరావు, బారు గోవిందరావు, మతుకుమల్లి నరసింహం మహావాది వెంకటరత్నం, డి. వి. కృష్ణయ్య అడవి బాపిరాజు, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి, జాషువా, ముదిగొండ వీరభద్రమూర్తి, డా॥ గిడుగు సీతాపతి, ప్రయాగ శేషాద్రిశాస్త్రి ఇంకా ఎంతమందో ప్రసిద్ధులు యీ పుత్సవములలో పాల్గొన్నారు. ప్రతిరోజు ఉపన్యాసములలో కాలేజి విద్యార్థులుకూడ పాల్గొన్నారు. బి. యస్. మూర్తిగారు ప్రత్యేకాహ్వానంపై యీ కార్యక్రమంలో పాల్గొన్నారు.

హిందూ కళాశాల విద్యార్థులు, 'స్వయంవరం', 'పరిష్కారం', 'ఆనాడు' అను నాటికలను చక్కగా ప్రదర్శించారు. హిందూ కళాశాలా చార్యులచే 'కోటి విద్యలు' అను నాటిక రసవంతంగా ప్రదర్శింపబడింది. గుంటూరు నాట్యమందిర్ వారు 'అబాతిక్రతువు' అను నాటికను ప్రదర్శించారు. 'కడగండ్లు' అనే నాటిక ఏలూరు కళాశాలవిద్యార్థులచే ప్రదర్శింపబడింది విజయవాడ కళాశాల విద్యార్థులు కూడ యీ నాటికా ప్రదర్శనాలలో పాల్గొన్నారు.

శ్రీమతి రామసుబ్బమ్మగారు, గుమ్మడదల సుబ్బారావుగారు ఆంధ్రుల ప్రతిభను చాటుచు, యీనాటి ఆంధ్రుల దుస్థితికి వగచుచు కార్యప్రతాపములకు కీర్తిగణించిన జాతి యీరోజు తమ హక్కులను విధిలేక వదులు కోవలసిన దుర్గతిపట్టెనని అన్నారు. బి. యస్. మూర్తిగారు ఆంధ్రనాయకులలోని అనైక్యత మన రాష్ట్రమునకు ఎంత అనర్థము చేయుచున్నదో వివరించి. ఆంధ్రనాయకులలో ఏకాభిప్రాయము, ఐకమత్యము, లేనంతకాలము ఆంధ్రరాష్ట్రమునకు భవిష్యత్తు గాని ఆంధ్ర ప్రతిభ కొకస్థానముగాని వుండదన్నారు. బారు గోవిందరావుగారు ఆంధ్రుల ఆర్థిక సంపద, ఖనిజసంపద, అభివృద్ధి కవసరమగు యితర లక్షణములన్నీయు సంపూర్ణంగా యున్నవనియు, ముందు ముందు విశాలాంధ్రము తప్పక ఏర్పడగలదనియు ఆనాడు జనాభాలోగానీ, వైశాల్యములో గానీ, సంపదలో గాని, ఆంధ్రుల మించినజాతి, ఆంధ్రరాష్ట్రమునకు మించిన రాష్ట్రము యుండబోదనియు అందువల్ల మనమిప్పటి నుంచే జాగ్రత్తపడి, ఆర్థిక ప్రణాళికలు తయారుచేసుకొని జాగ్రత్తగా మెలగవలయునని ప్రబోధించారు. మహావాది వెంకటరత్నంగారు ఆంధ్రుల కవిత్వ, శిల్ప, చిత్రకళా సంపదలనుగురించి ప్రసంగించారు. డా॥ గిడుగు సీతాపతిగారు చరిత్ర రచయితలు స్వాభిమానములకు లోనుగాక సత్యాన్వేషణమే పరమావధిగా పెట్టుకొనవలయుననియు, ఆంధ్రులును తెలుగువారును ఒకరే అని చెప్పుటకు చరిత్రాధారములు చాలవనియు అన్నారు. ప్రయాగ శేషాద్రిశాస్త్రి ఆంధ్రదేశంలో చరిత్ర రచయితలు, పరిశోధకులు పడుచున్న యిక్కట్లు యింతింత కావనియు, ప్రభుత్వపోషణ, ప్రజాదరము రెండును అవసరమైనంతగా లేవనియు, స్వాతంత్ర్యము లభించిన తరువాత కూడ యీ పరిస్థితులు మారలేదనియు అయినప్పటికి అనేక శ్రమలకోర్చి ఆంధ్ర పరిశోధకులు, ఆంధ్రచరిత్ర రచయితలు సల్పిన కృషికి మనము వారిని అభినందించవలయుననియు, భాషావాదము, భాషాతత్వవాదము చరిత్రకు, చరిత్రపరిశోధనకు అడ్డుపడరాదనియు అన్నారు.

ఈ వారోత్సవ కార్యక్రమంలో నవంబరు 30 సాయంకాలం నాటి, కవిసమ్మేళన, సన్మానసభ ఒక ప్రత్యేకరూపం దాల్చింది. ఆ సభే ప్రహానికాన్ని ఆకో...

## హేగ్ ఒడంబడికకు సమితి రాజకీయ సంఘ హర్షం

### భారతప్రతినిధి తీర్మానామోదం: ఉపసంఘ సమావేశంలో యుక్రెన్ ప్రతినిధి తీవ్రవిమర్శ

లేక్‌సక్సెస్ డిశెంబరు 3: హేగ్ సభలో డచ్చివారికి, ఇండోనీషియన్లకు మధ్య జరిగిన ఒప్పందాన్ని హర్షిస్తూ నేడుసమితి తాలూకు రాజకీయసంఘం ఒకతీర్మానాన్ని ఆమోదించింది.

ఆసియా రాజ్యాల సహాయంతోను, పసిఫిక్ ప్రాంత దేశాలమద్దత్తుతోను ఇండియా ఈ తీర్మానాన్ని ప్రతిపాదించింది.

సోవియట్ రష్యా కూటమితప్ప ఇంకా ఎవ్వరూ దీనికి వ్యతిరేకంగా ఓటు చెయ్యలేదు. అనుకూలంగా వచ్చిన ఓట్లు 43.

ఇండియా ప్రతినిధి సర్ బి. ఎన్. రావు ఈ తీర్మానంమీద మాట్లాడుతూ హేగ్ సభ నిర్ణయాలను ఇండోనీషియన్ రిపబ్లికన్లు అంగీకరించినందుకు హర్షాన్ని వెలిబుచ్చారు.

గత జనవరి నెలలో ఇండోనీషియా విషయాన్ని పురస్కరించుకొని ఇండియా ఆసియా రాజ్యాల సమావేశాన్ని జరిపింది. అందువల్ల ఈ సమస్య ఇట్లా పరిష్కారం కావడం ఇండియాకు ఆనందదాయకమైన విషయం అనికూడా ఆయన అన్నారు.

ఇప్పుడు ఒక ఒప్పందం కుదరగానే అంతా అయిపోయిందని భావించేవాళ్లలో నేను ఒకణ్ణికాదు. ఇంకా చాలా కార్యక్రమం నిర్వహించబడవలసి వున్నది. ముఖ్యంగా ఇండోనీషియా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగనిర్మాణం అత్యవసరం జరగవలసివుంది.

అయినా ఇంతవరకు ఈ సమస్య విషయంలో ఇరువర్గాలు సాధించిన మహావిషయాన్ని మనం ఎందుకు ఆమోదించరాదో అర్థం కావటంలేదు. త్వరలో ఏర్పడనున్న ఇండోనీషియా సంయుక్త రాష్ట్రాలను మనం ఎందుకు సౌహార్ద దృష్టితో వీక్షించరాదో అవగతం కాకుండావుంది.

ఇండోనీషియా సంయుక్త రాష్ట్రాలు ఒక రిపబ్లిక్ రాజ్యంగా అవతరించనున్నదంటే ఇండియా ప్రత్యేకంగా జోక్యాన్ని వెల్లడి చేయవలసి వుంది.

త్వరలో ఈ కొత్త రిపబ్లిక్ రాజ్యం మన సరసను కూర్చుంటుందని ఆశిస్తున్నాను.

ఇంతకుపూర్వం బైలోరష్యా, పోలండు ఓటింగు విషయంలో వెలిబుచ్చిన విరుద్ధ భావాన్ని ఈసంఘం త్రోసి రాజన్నది. అంతేకాకుండా యుక్రైన్ తెచ్చిన ప్రతితీర్మానాన్ని ఓడించి వేసింది.

డచ్చి సేనలను ఉపసంహరించాలని, ఇండోనీషియాలో డచ్చివారి చర్యలను విచారించేందుకు సెక్యూరిటీ కౌన్సిల్ సభ్యులతో ఒక విచారణసంఘాన్ని ఏర్పాటు చెయ్యాలని, ప్రస్తుతం వున్న సమితి తాలూకు ఇండోనీషియా కమిషన్‌ను రద్దు చేయవలసిందని యుక్రైన్ తన తీర్మానంలో కోరింది.

హేగ్ సభలో జరిగిన ఒప్పందాన్ని విమర్శిస్తూ, యుక్రైన్ ప్రతినిధి మాన్‌స్కీ డచ్చివారిని, రిపబ్లికనులుగూడా అడిపోసారు.

ఇండోనీషియన్ రిపబ్లికన్ ప్రభుత్వాన్ని 'హట్టాకూటమి' అని ఆయన గర్హించారు.

ఐక్యరాజ్య సమితి హేగ్ సభ నిర్ణయాలను హర్షించవలసిందిగా కోరుతూ సర్ బి. ఎన్. రావు తెచ్చిన తీర్మానాన్ని అధికరించే తీర్మానాన్ని ఈ మాన్‌స్కీ ప్రవేశ పెట్టారు.

దానిమీద మాట్లాడుతూ, బ్రిటన్, అమెరికాల మద్దత్తుతో ఇండోనీషియన్ ప్రజలమీద డచ్చివారు సాగిస్తున్న పోరాటం ఇంకా సాగుతూనే వున్నదని ఆయన అన్నారు.

అక్కడ ఇంకా భయంకరమైన యుద్ధం జరుగుతున్నది. అట్టి సందర్భంలో యిప్పుడు ఇండియా ప్రతినిధి వారి చర్యలను హర్షించవలసిందని మనలను కోరుతూ ఒక తీర్మానం తెచ్చారు.

హేగ్ ఒడంబడికను హర్షిస్తూ ఇండియా తెచ్చిన తీర్మానంమీద సంతకాలు పెట్టినందుకు ఆయన అరబ్బీ రాజ్యాలన్నింటిని తిట్టిపోసారు, హట్టాకూటమి ఇండోనీషియాను డచ్చివారికి అమ్మివేసింది. ఇండోనీషియా చాలామంది ప్రజలున్నూ, ప్రజాసైన్యాలున్నూ, యీ హట్టా ప్రభుత్వాన్ని గుర్తించటంలేదు; హేగ్ నిర్ణయాలను ఆమోదించటంలేదు. ఇండోనీషియా రిపబ్లిక్ సైన్యాలుగూడా ప్రజాసైన్యాల్లో చేరుతున్నాయి అని ఆయన అన్నారు.

నిజానికి హేగ్ సభలో హట్టాముఠా డచ్చివారితో చేసుకున్న ఒప్పందం ప్రజలకు స్వాతంత్ర్యం లేకుండా చేస్తున్నది. తమ సహజసంపదను వాడుకొనే అధికారం ప్రజలకు లేకుండా చేస్తున్నది.

ఇండోనీషియా సమస్య సంతృప్తికరంగా తేలిపోయినందుకు పాకిస్థాన్ ప్రతినిధి హర్షిస్తూ, వీట్‌నాం ప్రభృతి ఇతర రాజ్యాల సమస్యకూడా ఇట్లా తేలిపోతే బాగుంటుందన్నారు.

ఆస్ట్రేలియా ప్రతినిధి జాన్ వుడ్ హేగ్ నిర్ణయాలు సమితికి ఇంకో విజయాన్ని చేకూర్చాయని అంటూ, ఇండోనీషియా కమిషన్ ఈ విషయంలో పడిన శ్రమను హర్షించారు.

నెదర్లాండ్సు ప్రతినిధి తన ప్రసంగంలో యుక్రైన్ ప్రతినిధికి గట్టిగా జబాబు చెప్పారు. ఇకనుంచి తాము చేసే ఉపన్యాసాల్లో ఇండోనీషియా సమస్య అంటూ ఒకటి ఉండబోవడంలేదని ఆ ప్రతినిధికి ఇంతటి ఆవేశం కల్గిందని ఆయన అన్నారు.

మాన్‌సస్కీ మాట్లాడిన దానికి ప్రత్యుత్తరం చెప్పేందుకు ఇండోనీషియన్ ప్రతినిధులు ఇక్కడ లేరు. అందువల్ల ఆయనకు వారి తరపున నేను జబాబు చెప్పవలసి వచ్చింది. ఇండోనీషియా నాయకులను శంకించవలసిన అవసరం ఈయనకు ఎందుకు కల్గిందో నాకు అర్థం కావడం లేదు. ఇండోనీషియా ప్రజలకు వారు సరియైన ప్రతినిధులు. పోతే వారు కమ్యూనిస్టు పార్టీకి చెందిన వాళ్లు కాక పోవడమేమో మాన్‌సస్కీకి కోపం కల్గించి వుంటుంది అని డచ్చి ప్రతినిధి అన్నారు.

సిరియా, బర్మాలు సర్ నరసింగరావు తీర్మానాన్ని బలపరిచాయి. అమెరికా హేగ్ నిర్ణయాలను హర్షిస్తూ, అచ్చట త్వరలో స్వతంత్ర ప్రభుత్వం ఏర్పడగలదని ఆశించింది.

రష్యా ప్రతినిధియు క్రైన్ ప్రతినిధి పాడిన పాటకు వంత పాడారు. పైగా హట్టా, సోకర్నో ఇండోనీషియా కమిషన్‌లో పని చేస్తున్న అమెరికా ప్రతినిధులు ఇండోనీషియా స్వాతంత్ర్యోద్యమాన్ని నొక్కి వేయడానికి కుట్రపన్నారని ఆయన అన్నారు.

ఈ కుట్ర జరిగిన తరువాత హట్టా సోకర్నోల ప్రభుత్వం సిగ్గు విడిచి అమెరికా ఇచ్చిన ఆ యుద్ధాలతో ఇండోనీషియన్ దేశ భక్తులను, వారి ఉద్యమాన్ని అణచారని సారపకిన్ ఇంకో ఆరోపణ చేస్తూ, ఇప్పుడు వారు డచ్చివారికి పూర్తిగా లొంగిపోయారని అన్నారు.

హేగ్ ఒడంబడికలో రాజకీయము, సైనికము అయిన విద్రోహ చిహ్నాలు చాలా వున్నాయి. వాటి వల్ల ఇండోనీషియా ప్రపంచ శాంతికి భంగకారిగా పరిణమిస్తుంది అని రష్యా ప్రతినిధి హెచ్చరించారు.

హేగ్ ఒడంబడిక మూలంగా ఇండోనీషియాలో వలస రాజ్య తత్త్వం ఇంకో విధంగా అమలు జరుగుతున్నదని పోలిష్ ప్రతినిధి అన్నారు.

సోవియట్ ప్రతినిధులు, వారి కూటమలు అసలు విషయం ఏమిటో వదిలిపెట్టి, అందరిని ఆడిపోయడానికి పూనుకోవడం ఆశ్చర్యంగా వున్నదని ఈజిప్టు ప్రతినిధి అన్నారు. ఇండోనీషియా సర్వ స్వతంత్రం అయ్యేటట్లు చూడవలసిన బాధ్యత మన మీద వుంది. వారి మార్గంలో అవరోధం కల్పించ వలసిన వాళ్లం మనం కాదు అని ఆయన హెచ్చరిక.

## రిపబ్లిక్ పార్లమెంట్ ఆమోదం

### వచ్చేవారంలో లభిస్తుంది

బటేవియా, డిసెంబరు 3: ఇండోనీషియా రిపబ్లిక్ పార్లమెంటు వచ్చే వారంలో హేగ్ ఒప్పందాన్ని ఆమోదిస్తుందని తెలియవచ్చింది. దేశంలోని ఫెడరలిస్టు రాష్ట్రాలన్నీ ఒప్పందాన్ని ఆమోదించినవి. రిపబ్లికన్ పార్లమెంటు సోమవారంనాడు జోగ్జకర్తాలో ఒప్పందంమీద చర్చను ప్రారంభిస్తుంది.

ఇప్పటికి తూర్పు ఇండోనీషియా, తూర్పు, పడమర బోర్నియోలు, తూర్పు, దక్షిణ సుమాత్రాలు, తూర్పు, మధ్య జావాలు ఒప్పందాన్ని ఆమోదించినవి.

...వంగా ఆకర్షించినదని చెప్పాలి. దీనికి ఆచని బాపిరాజుగారు అధ్యక్షత వహించారు. కళాశాల విద్యార్థిసంఘంవారు అధ్యక్షునికి తదితర కవిశ్రేష్ఠులకు చందన తాంబూలాది సత్కారములుచేసి ఖద్దరు శాలువలు బహూకరించారు. ఉత్సవాలకు జయం కలగాలి అని కోరుతు సాంతి రామమూర్తి, డా॥ సి. ఆర్. రెడ్డి, రంగా, కళా వెంకటరావుగార్లు పంపిన సందేశాలను బారు గోవిందరావుగారు చదివారు. వింజమూరి శ్రీనివాసాచారిగారు గారడీ, సంగీతము, యిమితేషను చేసి సభ్యుల నానందింపచేశారు. (స్వ. వి.)

## బొంబయి గవర్నర్ త్యాగశీలం

### జీతంలో 15% తగ్గించు కోవడానికి నిర్ణయం

బొంబాయి, డిసెంబరు 3: బొంబయి గవర్నర్ సర్ మహారాజ సింగ్ నవంబర్ 1 వ తేదీనుండి తన నెల జీతంలో నూటికి 15/- లు తగ్గించు కొనుటకు నిర్ణయించారని నేడు బొంబయి ప్రభుత్వం ప్రకటించింది. ఈయన నెల జీతం 5500.

1948 ఏప్రెల్ 1 నుండి యింతకంటె ఎక్కువ మొత్తాన్ని తగ్గించు కొంటానని సంవత్సరం క్రితం మహారాజా సింగ్ భారత ప్రభుత్వానికి తెలియ జేశారనికూడ ఈ ప్రకటన తెలుపుతుంది.

## గుంటూరు 10 వ వార్డు మున్సిపల్ ఎన్నిక తగాదా తీర్పు

గుంటూరు, డిసెంబరు 3: గుంటూరు ఎన్నికల అధికారి ఎమ్. నరసింహాచారిగారు 10 వ వార్డు మున్సిపలు ఎన్నిక పిటిషనులో తీర్పు చెప్పుతూ, యీ పిటిషనులో వాది ఆయినటువంటిన్నీ, 10 వ వార్డుకు స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయినట్టిన్నీ పొత్తూరి వెంకటప్పయ్య గారి వాదమంతయు సత్యమని, వారు 10 వ వార్డు నుండి పురపాలక సంఘమునకు సక్రమంగా ఎన్నుకోబడినట్లుగా తెలియ జేసారు. స్వ. వి.

## ఇండియా, సింహళ అనుమతి పత్రాలు

మదరాసు, డిశంబరు 4: మదరాసు ప్రభుత్వ ప్రచురణశాఖ డైరెక్టరు ఇలా ప్రకటించుచున్నారు:

ఇండియా, సింహళ అనుమతి పత్రములుగల పుస్తకములు, దరఖాస్తు ఫారములు మదరాసు కమిషనర్ ఆఫ్ పోలీసుకు, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటుకలెక్టరుకు, పాసులు ఇచ్చుటకు అధికార మివ్వబడిన ఇతర జిల్లాల మాజిస్ట్రేటులకు అందజేయడినవి. మామూలు ప్యాసు పోర్టుకు బదులు ఇండియా, సింహళ అనుమతి పత్రము తీసుకొన దలచినవారు, వారు నివసించు ప్రాంతమునకు సంబంధించిన అధికారికిదరఖాస్తు చేయవచ్చునులోగడ ప్రకటించినట్లుగనే సామాన్య జనుల నిమిత్తము అనుమతిపత్రములు ఇవ్వబడవు. రుసుము రు 2/-లు. జారిచేసిన తేదీనుండి నాలుగు నెలల వరకు అమలులో వుండును. ఈ అనుమతిపత్రము పొందినవారు కొలంబోలోని ఇమిగ్రేషన్ కంట్రోలరునుండి శాశ్వతము లేక తాత్కాలిక నివాస అనుమతిని పొందవలెను. నిర్ణీత ఫారములను పూర్తిచేసి ఇండియా సింహళ అనుమతి పత్రమొసగిన అధికారికి అందజేసిన ఆ దరఖాస్తును సింహళ ప్రభుత్వమునుండి అవసరమగు అనుమతిని తెప్పించుటకు ప్రభుత్వమునకు పంపెదరు. శాశ్వతపు నివాస అనుమతి రు 10/- తాత్కాలికపు నివాస అనుమతికి రు 2/- లు రుసుము చెల్లించవలెను. దరఖాస్తులకు స్టాంపులు అంటించకూడదు. సింహళ ప్రభుత్వమునుండి అనుమతి పత్రములు అందిన తరువాత రుసుమును వసూలు చేసెదరు.

## సెంట్రల్ పోలిటెక్నిక్‌విద్యార్థి సంఘ ప్రారంభము

### విద్యార్థులకు న్యా॥ రాఘవరావు గారి హితవు

మదరాసు, డిశంబరు 4: విద్యార్థులు గురుకుల పద్ధతులను అనుసరించి వినయవిధేయతలను అలవరచుకొనవలెనని నిన్న సాయంత్రం బ్రాడ్వేలోని ప్రభుత్వ సెంట్రలు పోలీ టెక్నిక్ విద్యార్థిసంఘమును ప్రారంభించుచు న్యాయమూర్తి శ్రీ చింతగుంట రాఘవరావుగారు విద్యార్థులకు హితవొసగిరి. విశ్వశాంతి, విశ్వమానవ సౌభాతృత్వములను ఆదర్శముగా తీసుకొనవలెననిరి. సాంకేతిక విద్యను అభ్యసించుచున్ననూ ఇతర కళలను వదలకుండా భరతవర్ష సంస్కృతిని కాపాడవలెనని న్యాయమూర్తి చెప్పిరి.

మదరాసు మేయరు శ్రీ పి. వి. చరియర్ అధ్యక్షతవహించుచూ సాంకేతిక విద్యాప్రవీణులు లేనిదే దేశములో పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధి సాధ్యము కాదనిరి. ఆటస్థలముగురించి చెప్పుచూ విద్యార్థులు ఏదో ఒకక్రీడను నేర్చుకోవాలనియు అనతికాలములో క్రీడాస్థలము ఏర్పడగలదని డా॥ చరియర్ అనిరి. శ్రీ యం. యస్. మాధవరావుగారు న్యా॥ రాఘవరావు, డా॥ చరియర్ గార్లకు స్వాగత మిచ్చిరి.

### నాటక కళాపరిషత్తు కార్యవర్గ సమావేశం

ఆంధ్ర నాటక కళా పరిషత్తు కార్యవర్గ అత్యవసర సమావేశము డిసెంబరు 11 వ తేదీ ఉదయం 12-30 కు పాలకొల్లు క్లబ్బులో జరుగుతుందని ప్రధాన కార్యదర్శి పసల సూర్యచంద్రరావుగారు తెలియ జేస్తున్నారు.

## టిబెట్ తమదేనని చైనా కమ్యూనిస్టు ప్రభుత్వ వాదం

### సోవియట్ రష్యా సమర్థింపు: నూతన ప్రభుత్వానికి చైనా ప్రజల సహకారం

లండన్, డిసెంబర్ 4: టిబెట్ తనదేనని కమ్యూనిస్టు చైనా చేస్తున్న వాదాన్ని ఈ పేరి మాస్కో పత్రిక 'న్యూటైమ్స్' గట్టిగా సమర్థించింది. తన వాదాన్ని సఫలం చేసుకొనటానికి చైనా కమ్యూనిస్టులు త్వరలోనే చర్యలు తీసుకో లరని ఇక్కడ విశ్వసించబడుతున్నది.

"ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు టిబెట్‌ను చైనానుండి విడదీసి తమ యుద్ధ స్థావరంగానూ, వలసగానూ చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. కాని టిబెట్ నిజానికి చైనాలో అంతర్భాగమే. 8 వ శతాబ్దంనుంచీ టిబెట్, చైనాలకు సంబంధాలు ఉన్నవి. ఇప్పటివరకూ జరిగిన అంతర్జాతీయ ఒడంబడికలన్నీ చైనాకు టిబెట్ మీద అధికారం వున్నదని అంగీకరిస్తున్నవి." అని న్యూటైమ్స్ వ్రాసింది.

## కమ్యూనిస్టు చైనాలో నిర్మాణ కార్యక్రమం

లండన్, డిసెంబర్ 3: చైనాకమ్యూనిస్టు ప్రజాప్రభుత్వం పరిపాలనా నిర్వహణకై 20 కోట్లయూనిట్ల విక్టరీ బాండ్లను జారీ చేయబోతున్నదన్ని న్యూ చైనా వార్తా సంస్థవెల్లడించినది. ఒక్కొక్క యూనిట్ విలువ ఆరు కట్టీల బియ్యం విలువకు కానీ, $1\frac{1}{2}$ కట్టీల గోధుమ పిండి విలువకు కానీ, నాలుగడుగుల మంచి రకం బట్ట విలువకు గానీ, లేక 16 కట్టీల బొగ్గు విలువకు కానీ సమానమని నిర్ణయించబడినది. కట్టీఅంటే 16 ఔన్సులు.

ఈ పదార్థాల విలువ షాంఘై, టీంట్సిన్, హాంకో, కాంటన్, చుంకింగ్ నగరాల్లో ఉన్న సగటు ధరలను పట్టి నిర్ణయించబడుతుంది. ప్రజలు ఈ పదార్థాలను ఇచ్చికానీ, లేక నిర్ణయించబడ్డ ధరలను రొక్కరూపంలో ఇచ్చికానీ ఈ యూనిట్ బాండ్లను కొనుక్కోవచ్చును. 5% వడ్డీతో వాయిదాలమీద 5 ఏళ్ళలో బాండ్లు చెల్లించబడతవి. ఇవి జనవరి నుంచీ అమలులోకి రాగలవు.

కమ్యూనిస్టు రిపబ్లిక్ కేంద్రప్రభుత్వం నిన్న అధ్యక్షుడు మావ్‌సీటంగ్ అధ్యక్షత సమావేశమై ఈ బాండ్లను జారీ చేయటానికి నిశ్చయించింది. ఉపాధ్యక్షుడు చెన్యన్ మాట్లాడుతూ ప్రజాసైన్యం ఎంతో విశాలప్రదేశానికి విమోచన కలిగించినందువల్ల జాతీయ వ్యయం చాలా పెరిగిందనీ, ఈ బాండ్లు ప్రభుత్వపు కొరతను తగ్గించి ప్రజలందరికీ మేలు చేయగలవనీ అన్నాడు.

ఆర్థికమంత్రి పో-యి-పో ప్రసంగిస్తూ "ఈ తడవ బడ్జెట్‌లో 60 వంతులు సైనిక, ప్రభుత్వ వ్యయాలకూ, నిర్మాణ కార్యక్రమానికి 25.9 వంతులూ వినియోగించబడతవి. ప్రభుత్వం పోషించవలసినవాళ్లు 90 లక్షలమంది—సైన్యం, ఉద్యోగులు కలిపి—ఉండడంవల్ల 60 వంతుల ఖర్చు సైనిక, ప్రభుత్వ నిర్వహణలకు అవసరం" అని అన్నాడు.

మరొక ఉపాధ్యక్షుడు లీచీషిన్ ప్రసంగిస్తూ యుద్ధం చెలరేగి జరుగుతున్నప్పటికీ ప్రజాప్రభుత్వం సైనిక వ్యయానికి 38 8% మాత్రమే బడ్జెట్‌లో ప్రత్యేకించ బడినదని అన్నాడు.

అధ్యక్షుడు మావ్‌సీటంగ్ ప్రసంగిస్తూ ప్రస్తుతం ఆర్థికచిక్కులు ఉన్నప్పటికీ, ప్రతి సంవత్సరమూ పరిస్థితులు కుదుటబడగలవనీ, 5 ఏళ్ళలో సంపూర్ణంగా చక్కబడుతుందనీ, భవిష్యత్తు చాల ఉజ్జ్వలంగా ఉన్నదనీ హెచ్చరించాడు.

## నూతన ప్రభుత్వానికి చైనా ప్రజల సహకారం

లండను, డిశెంబరు 3: నేడు లండనులో బ్రిటను-చైనా మహాసభ ఆరంభమయింది. ఇది రెండు రోజులపాటు జరుగుతుంది. 15 మాసాలపాటు చైనాలోని కమ్యూనిస్టు సేనల వెంట ఉండి ఇటీవల తిరిగి వచ్చిన ఆలన్ విన్నింగ్టన్ అనే ఆయన ఈ మహాసభలో ప్రసంగిస్తూ ఈ విధంగా చెప్పారు.

"ఒక తరంలోగా చైనా పారిశ్రామికంగా ఉన్నత స్థానం ఆక్రమించగలదు. 15, 20 సంవత్సరాలలోగా ఈ ఆశయం సిద్ధింప చేయడానికి నూతన చైనా నాయకులు ప్రణాళికలు సిద్ధం చేసి ఉన్నారు. అయితే వారు తమ ప్రణాళికలను అనుకొన్న దానికన్న త్వరగా అమలు చేస్తూ ఉన్నారు. కనక ఈ ప్రణాళిక ఇంకా ముందుగానే ఫలవంతమై 10, 12 ఏళ్లలోనే చైనా పారిశ్రామికోన్నతి సాధించవచ్చు.

"చైనా కమ్యూనిస్టులకు చైనాప్రజలు మనం ఊహించలేనంతి ఉత్సాహవంతమైన సహకారం ఇస్తున్నారు. అవినీతి నిర్మూలించి, ఉత్పత్తులు హెచ్చించి, భూసంస్కరణలు సాగించి, వేతనాలు పెంచి, నూతనోత్పత్తి విధానాలు అమలుజరపడంలో కార్మిక కర్షకులు పాల్గొనే అవకాశాలివ్వడంచేత నాయకులకు ప్రజల సహకారం లభిస్తున్నది."

సమావేశానికి ప్రసిద్ధ మేధావులూ, శాస్త్రవేత్తలూ, కార్మిక నాయకులూ, పార్లమెంటు సభ్యులూ, లార్డు బాయిడార్, లార్డు స్ట్రాబోల్గీలవంటి ప్రముఖ వ్యక్తులూ, ఒలాఫ్ స్టేప్లెడన్, ఆగ్నిస్ మెడ్లీ వంటి రచయితలూ వచ్చారు.

మావో సేటంగ్, ప్రొ॥ బ్లాకెట్ మొదలైన అనేకులు సందేశాలు పంపారు.

## ముక్డెన్‌లోని అమెరికన్ కాన్సల్

### జపానుకు పంపేందుకు ప్రయత్నం

శాన్‌ఫ్రాన్సిస్కో, డిశంబరు 4: ముక్డెన్‌లోని అమెరికన్ కాన్సల్ జనరల్‌ను అంగస్ వార్డ్‌ను ఆయన సిబ్బందిని వారం రోజుల్లో కమ్యూనిస్టు చైనానుంచి జపానుకు తీసుకొని వెళ్ళడానికి, ఒక నౌకను పంపుతున్నామని పసిఫిక్ దూరప్రాచ్య నౌకా కంపెనీ అధికారులు ప్రకటించారు. లేక్ ఉడ్ విక్టరీ అనే తమనౌకను పంపవలసిందిగా అమెరికా విదేశాంగశాఖవారు కోరగా, అందుకు యీ కంపెనీ సమ్మతించింది. అమెరికన్ కాన్సల్ జనరల్ ఆయన సిబ్బంది ప్రస్తుతం, టీంట్సిన్ రేవుకు ఆవలగా టాకువద్ద ఉన్నారు.

## నెహ్రూకు బ్రిటిషు పార్లమెంటు సభ్యుల లేఖ

### హైదాబాద్ ప్రభుత్వ ప్రతినిధి వ్యాఖ్య

హైదరాబాద్, డిసెంబరు 4: హైదరాబాద్‌లో 'రైతునాయకులు' కొంతమందిపై విధించబడిన శిక్షలను నిలుపుదల చెయ్యవలసిందని కోరుతూ బ్రిటిషు పార్లమెంటు సభ్యులు కొంతమంది భారత ప్రధానమంత్రి నెహ్రూకు పంపినారని చెప్పబడుతున్న లేఖనుగురించి వ్యాఖ్యానించుతూ, హైదరాబాద్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు, యీ లేఖలోని విషయాలు 'సరికావని' అన్నారు. ఇందులో ఉదహరించబడిన నేరస్థులు మామూలు నేరస్థులుగానే చూడబడినారన్నారు. బ్రిటిషు పార్లమెంటులోని లేబరు స్వతంత్రసభ్యులు డి. ఎన్. ప్రిట్, కోనీ మొదలైనవారు విలియంగలాచర్, ఫిల్ పిరటాన్‌వంటి కమ్యూనిస్టుసభ్యులు యీ లేఖపై సంతకాలు చేశారుట.

అధికారప్రతినిధి తన వ్యాఖ్యానమును కొనసాగిస్తూ, ప్రథమంలో, యీ నేరస్థులను విచారించినది లేఖలో వివరించినట్లుగా 'మిలిటరీకోర్టులు' కావన్నారు. సంస్థానంలో పోలీసు చర్యకు ముందు, ఆ తరువాత జరిగిన కొన్ని నేరాలను విచారించుటకుగాను ఏర్పాటు చెయ్యబడిన ప్రత్యేక న్యాయవిచారణ సంఘాలన్నారు. ఇందులో జుడీషియల్ అధికారాలు కలిగిన ఒక సివిల్ పరిపాలనాధికారి, మరి యిద్దరు సివిల్ జడ్జీలు వున్నారన్నారు. లేఖలో ప్రస్తావించబడిన వ్యక్తులపై హత్య, దోపిడీవంటి అనేక నేరాలు మోపబడినవన్నారు. ఇటువంటి నేరాలు చేసినవారిపై శిక్ష విధించినందుకు బ్రిటిషు పార్లమెంటుసభ్యులు ప్రభుత్వాన్ని తప్పుపట్టరని విశ్వసిస్తున్నామన్నారు. రాజకీయ నేరానికిగాని 'రైతునాయకుడై నందుకుగాని' ఎవరినీ శిక్షించటం లేదన్నారు. లేఖలో ఉదహరించబడిన దిన లింగయ్య కుర్రవాడు కాదనీ, మైనరు దాటినవాడనీ, యితనికి మూడు హత్యలతో సంబంధ మున్నదనీ అన్నారు.

అసలు వీటన్నిటికీ మించి, ముద్దాయిలందరికీ, ప్రత్యేక న్యాయవిచారణ సంఘాలిచ్చు తీర్పులమీద హైకోర్టుకు అప్పీలు చేసుకొనేహక్కు ఉన్నదన్నారు. ఇంతవరకు ప్రత్యేక న్యాయవిచారణ సంఘాలచే విధింపబడిన ఉరిశిక్షలేవీ అమలు జరుపబడలేదన్నారు.

### కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, డిసెంబరు 4: కృష్ణానది నీటిమట్టం నేడు ఆనకట్టపై 6-4 అడుగు లున్నది.

## ప్రపంచశాంతి కాముల మహాసభ

### భారత-పాకిస్తాన్ విభేదాల పరిష్కారానికిమార్గాన్వేషణ

శాంతినికేతనం, డిసెంబరు 3: ప్రపంచ శాంతికాముల మహాసభ ఇప్పుడు శాంతినికేతనములో సమావేశమగుచున్నది. ఈ సభకు ఇంగ్లండులోని అంతర్జాతీయ యుద్ధ నిరోధక సంఘముయొక్క అధ్యక్షుడు యీ క్రిందిరీతిగా ఒకసందేశమును పంపెను.

21 సం॥ల క్రిందట అంతర్జాతీయయుద్ధ నిరోధక మహాసభ జరిగినప్పుడు గాంధి మహాత్ముని ప్రతినిధులుగా మీ దేశమునుండి ప్రముఖులు విచ్చేసిరి. ఆనాడు ఆసభ ఆస్ట్రియాలో జరిగెను. ప్రపంచ శాంతికాములకు ప్రముఖులు గాంధి మహాత్ముని కలిసికొనగల్గుటకు యీ మహాసభ సంకల్పింపబడెను. కాని ఆ మహాత్ముడిప్పుడు లేకపోవుట విషాదకరముకాని గాంధిమహాత్ముడు ప్రజాహృదయములో సజీవమై యున్నాడు. ఆయనయొక్క ఆత్మతేజము ప్రపంచములోని బహు దూర దేశములకుకూడా వ్యాపించింది అహింసా ధర్మావలంబనమువల్లనే భారతజాతి స్వాతంత్ర్యమును సాధింపగల్గెను. యుద్ధములు జరుగకుండా నిరోధించుటకై ప్రజలను తయారు చేయవలెను. అందుకొరకై నిర్మాణ కార్యక్రమము చాలా జరుగవలసి ఉన్నది.

### శాంతికాముల సభా వృత్తాంతం

శాంతికాముల మహాసభ వ్యవహారముల గూర్చి నేడు సభానిర్వాహకులు యీ క్రిందిరీతిగా ప్రకటన చేసిరి

ఈ సభకు సంయుక్తపరగణాల ప్రధాన మంత్రియగు గోవిందవల్లభపంతుగారు అభినందన సందేశమును పంపిరి. ఐయిక్యరాజ్య సమితియందు దక్షిణాఫ్రికా జాతులవారి పక్షమున వాదించిన నటువంటి మైకేల్ స్కాటుగారు యీ సభ సేవ గ్రామములో సమావేశమునాటికైనను రాదలంచిరి

లండనులోని ఫ్రెండ్సు సర్వీసు కౌన్సిలున్నూ పశ్చిమలోని ఫ్రెండ్సు సొసైటీయున్నూ ఇంకా యితర శాంతివాదుల సంఘములును అభినందనసందేశములు పంపెను

శాంతినికేతనంలోని విద్యార్థుల సమావేశములందు ఇచటకు వచ్చిన సభా ప్రతినిధులు కొందరు ఉపన్యసించుచున్నారు

పాకిస్తానుకు భారతదేశానికి కాశ్మీరు వ్యవహారవిషయములో ఉన్నటువంటి తగాదా ఏ విధంగా పరిష్కరించుకొనుటకు భారతదేశము నిర్ణయించినదని భారతీయ ప్రతినిధులకు ఒకరు ప్రశ్నించిరని శ్రీ సుధీర ఘోషుగారు నేడు సభలో చెప్పిరి. గాంధీ అనుచరులైనవారు పాకిస్తానుతో వ్యవహారములను స్నేహపూర్వకంగా పరిష్కరించుకోవలెనన్నారు ఈ విషయము ఆవేశంతో తర్కించవలసినది కాదనియు, ఆత్మాన్వేదతో భక్తి నమ్రులమై యోచించవలసి యున్నదని యు సుధీరఘోషుగారు చెప్పిరి. ఈ విషయమై రాజకుమారి అమృతకౌరుగారు ఇట్లు చెప్పిరి హిందూముస్లిం సఖ్యతకై గాంధీ తన ప్రాణము అర్పించెను. మన ఇండియాలో ఉన్న మహమ్మదీయులతో మనము సఖ్యతగ ఉండగలిగినయెడల వారియెడల ఆదరాగము చూపగల్గినయెడల పాకిస్తానుయెడల మనకు ద్వేషముండదని పాకిస్తానుకు నమ్మకము కలుగచేయగలము. ధనికవర్గములతో గాంధీజీ యొక్క సంబంధము ఎటువంటిదని రెవ. నాకయామాగారు ప్రశ్నించిరి. అందుకు ప్యారిలాలుగారిట్లు బదులు చెప్పిరి. ధనవంతులచేతనే త్యాగములు చేయించి వారిని భిక్షువులుగా చేయుటకు గాంధీ ప్రయత్నించెను. జి. రామచంద్రన్‌గారు అందుకు యీ క్రిందిరీతిగా ప్రత్యుత్తర మిచ్చిరి. ప్రజాసేవను చేసే ధనికుని రెండువిధములుగా ఉద్ధరించిరి. అతను ప్రజాసేవనం చేయకుండా సంస్కరించిరి. అంతేగాక అతనికికూడా ఆత్మసంస్కారము కలిగేటట్లు చేయాలి. ఈవిధంగా ధనవంతులను గాంధీజీ ఉద్ధరింపగలిగెను.

ఆచార్య కృపలానీ ఇట్లు చెప్పెను. గాంధీజీ చివరదినములలో తన ఉపదేశములను ధనికులు శిరసావహింపజాలకపోయినందుకు విచారము పొందెను.

శ్రీ సి. కుమారప్పగారు గాంధీజీ యొక్క ఆర్థిక సిద్ధాంతములను వివరించి చెప్పిరి.

నేల బొగ్గుగనులను కిరసనాయిలు గనులను పరిశ్రమలు నడిపించబడే యెడల ఆ బొగ్గు కిరసనాయిలు సప్లయి కాకపోతే, ఆ పరిశ్రమ సాగదు కనక అట్టి ఆధారద్రవ్యము గల గనులు ఉన్న ప్రదేశములను ఆక్రమించుకోవలెననే ప్రాకులాట అనేక రాజ్యాలకు కలుగును. మన మిప్పుడు గనుల్ని ఉపయోగించి అనేక ఫ్యాక్టరీ సరకులను ఉత్పత్తి చేయుటలో హింసా విధానం వర్తించుచున్నది గ్రామ పరిశ్రమలను ఉద్ధరించినయెడల అట్టి హింసా తత్వం అంతరించగలదు.

సాయంకాల సమావేశంలో పాశ్చాత్య రాజ్యాలయందు శాంతివాదుల ఉద్యమములు ఎ.తెంకు హొనసానోతో చర్చింపబడెను.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 7 బుధవారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఆర్. కృష్ణ కీత్ రాధాకృష్ణన్, వీణ. 8.0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం ( ) 8 30 మదరాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి), 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 ఎం. ఎస్. రామచంద్రరావు, పాట. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-10 పి. ఎల్. సరస్వతీదేవి. పాట. 7-0 ఎల్. కె. నొగ్గె స్వామి. పాట. 7-30 కె. తిరుమణీదేవి. పాట. 8-0 మద్రాసు (బి) వలె. 8-30 కల్లక్కాడ్ ఎస్. మహాదేవన్. పాట. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 ఐక్యరాజ్యసమితి. విద్య. వైజ్ఞానిక పునర్నిర్మాణము, ఆంగ్లమున ప్రసంగం 9-30 మదరాసు (బి) వలె 10-0 గాత్రసంగీతం రికార్డులు.

## మద్రాసు (బి)

ఉ. 7-0 తెలుగున వార్తలు. 7-15 వి. వి. శేషగోపన్ రికార్డులు. 7-45 మద్రాసు (బి) వలె. 8-30 డి. పట్టమ్మాళ్, పాట. మ. 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. యుద్ధములు. ముట్టడులు. శ్రీరంగం ముట్టడి. ప్రసంగం. కె. సుబ్బరామయ్య వ్యాఖ్యాన పాఠములు. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు, విద్యుత్ ఉత్పత్తి విధానములు. రాపిడివలన. ప్రసంగం. హరి ఆదిశేషువు. బడిలో నాటకశాల. పుల్లయ్య వేమవరం నాటిక. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. లేఖా రచన సారస్వత లేఖలు. ప్రసంగం. ఎ. రామకృష్ణారావు, మైదాన్. నాటకము. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయసంగీతం [రి] 6-30 గ్రామస్థుల కార్యక్రమం. కర్షక శత్రువు. కర్షక మిత్రువు. ప్రభుత్వ వ్యవసాయ శాఖవారి ప్రసంగం. పుట్టమిద్ది పాల పిట్ట, జానపదగేయం. విశేషాలు. ప్రకటనలు. ధరలు. వాతావరణ వివరాలు. 7 తెలుగున వార్తలు. 7-15 గీత గోవింద గానము. 8 'హేమంతవధము' రూపకము. రచన. టి. కృత్తివాసతీర్థులు. 8-30 మద్రాసు (ఎ) వలె. 9-30 ఎం. గోవింద స్వామినాయుడు. వేణువు. 10 మద్రాసు (ఎ) వలె.

## విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 డి. కె. పట్టమ్మాళ్ రికార్డులు 7-30 రాయప్రోలు జానకీదేవి. పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 గీతావళి చిట్టూరి రామకృష్ణారావు. 8-30 చాగంటి గంగరాజు. వయొలిన్. మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1 శాగాపసం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. సా 5-30 చాగంటి గంగరాజు. వయొలిన్. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి చిట్టూరి రామకృష్ణారావు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసు నుండి) 7 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి). 7-45 కాలచక్రము. అంతర్జాతీయ వార్తా సమీక్ష. సోమంచి లింగయ్య. 8 శిష్టు శ్రీరామశాస్త్రి. వీణ 8-30 రాయప్రోలు జానకీదేవి. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 చిత్రవాణి (రి). 9-30 శిష్టు శ్రీరామశాస్త్రి. వీణ.

## హైద్రాబాదు

ఉ 7-30 మధుసూదన్ భావే. ఖయాల్ జాన్పూరి. 7-45 జహీద్ అలీ. గీత్. 8 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 8-20 వి. నరసింహారావు. కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు. 9-15 సరస్వతీబాయ్. ఠుమ్రీ. ఘజల్. మ 12-30 సారంగి (రి). 1 కృతులు రికార్డులు 1-30 ఆంగ్లమున వార్తలు. 1 50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). సా 5. మధుసూదన్ భావే. ఖయాల్ ముల్తానీ. 5-10 సరస్వతీబాయ్. దాద్రా. ఘజల్. 5-25 జహీద్ అలీ. గీత్. 5-35 సరస్వతీబాయ్. ఠుమ్రీ. భజన్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున. పైరుల తెగుళ్లు (11) తెగుళ్ల వివరాలు. పి. కృష్ణమూర్తి ప్రసంగం. గీతాంజలి కె. వెంకటేశ్వరరావు. మహాపురుషులు (9) మధ్వాచార్య. ప్రసంగం. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 బుర్రకథ 'వీరబొబ్బిలి' 7-45 నూతన లెవీ విధానం హైద్రాబాద్ సప్లయి మంత్రి పి. హెచ్. కృష్ణరావు ఆంగ్ల ప్రసంగం. 7-55 జహీద్ అలీ. గీత్. 8-30 మధుసూదన్ భావే. ఖయాల్ మాల్‌కౌస్. 8-45 సరస్వతీబాయ్. దాద్రా. గీత్. 9. ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 జహీద్ అలీ. దాద్రా. ఘజల్. 9-30 సరస్వతీబాయ్. గీత్. 9-55 శ్రోతలు కోరిన రికార్డులు.

# తుపాన్ బాధితులకు సహాయం

## మంత్రి సీతారామరెడ్డిగారి విజ్ఞాపన

మదరాసు, డిసెంబరు 4: "ప్రకృతి యొక్క ప్రచండ శక్తికి ఇవ్వవలసిన బలి తీసుకున్నది: బాధితులకు సహాయపడుట ఇక మన విధి. ఇంతకు మించిన మానవ సేవా కార్యము వుండజాలదు." అని మదరాసు ప్రభుత్వ రివిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు శనివారం రాత్రి ఆలిండియా రేడియో ఉపన్యాసములో చెప్పిరి.

ఉపన్యాసములో ఇంకనూ యిట్లు చెప్పిరి: ఈ సంవత్సరము సెప్టెంబరు, అక్టోబరు నెలలో వరద, తుపాను వరసవరసగా రావటము మన దురదృష్టము. మదరాసు తీరమున అనేకసార్లు తుపానులు, పుప్పెనలు వచ్చినవిగాని మొన్న అక్టోబరులో తుపానువల్ల కలిగినంత ఆస్తి నష్టము ప్రాణనష్టము ఎప్పుడూ కలుగలేదు. తీరవాసులు అనుభవజ్ఞానము వల్ల తుపాను, పుప్పెన రానున్నదని తెలుసుకో గలిగిరి కాని జాగ్రత్తలు తీసుకొనుటకు వీలగు వ్యవధి లేకపోయెను.

"నేను తుపానుదెబ్బతిన్న ప్రాంతములో పర్యటించునప్పుడు కెరటము వచ్చుటకు ఒక గంట ముందు సముద్రములో బడబాలనమును చూచి నామని కెరటము వచ్చుటకు అదే గుగుర్తుగ తెలుసుకొని ప్రజలు సురక్షిత స్థానములు చేరుకున్నారు."

అక్టోబరు 25న వాతావరణ పరిశీలన శాఖవారు ఆలిండియా రేడియో ద్వారా తుపాను హెచ్చరిక ఇచ్చిరి. కలెక్టర్లకూ కొంతమంది ఇతర ఉద్యోగులకు ఈ వార్త అందజేయబడెను. తీరములోని ఆంధ్రరైతులు రేడియో హెచ్చరిక విని జాగ్రత్తపడిరి.

తుపానుకు అరటిచెట్లు పడిపోకుండా ఆకులు నరికివేశారని చెప్పరా నాకు ఆశ్చర్యమైనది. ఇదువలన కొన్ని తోటలు సర్వనాశనము కాకుండా మిగిలినవి. వాతావరణ పరిస్థితిని ఇప్పటికన్న వ్యవధిగా తెలుసుకొనుట సాధ్యమేనని సూచనలను గుర్తించి ప్రయోజనం పొందునట్లు రైతులకు బోధించవలెననిరి.

వరద నిరోధకసమస్యలుగురించి మంత్రిగారు ఉపన్యాసములో ఇటీవల ఆసియా దేశములలో పరిశీలన నిమిత్తం నియమించబడిన ప్రవీణులసంఘము ఇటీవల సర్కారు జిల్లాలలోని గోదావరి, కృష్ణానదీ లోయలను దర్శించి వరద నిరోధక చర్యలుగురించి పరిశీలించిరనిరి.

వరద నిరోధము, ఇరిగేషన్, నావిగేషన్ విద్యుచ్ఛక్తి వుత్పత్తి సమన్వయించి జరుగవలెననీ దామోదర లోయ ప్రాజక్టు ఇటువంటిదనీ, మంత్రిగారనిరి. వరద నిరోధము ద్వారా దేశ సంపదను పెంపొందించవచ్చును. వరద నిరోధముతోబాటు, నదీ ప్రవాహ నిగ్రహము కూడ జాతినిర్మాణ కార్యములలో ప్రధానమైనదనిరి.

తరువాత మంత్రిగారు ఉపన్యాసములో వరద తుపాను నష్ట తీవ్రతను వివరించుచూ నేను వెళ్ళిన ప్రతిచోటా రెండవ పంటకు వెంటనే నీరు ఇవ్వవలసినదిగా కోరిరి. సముద్ర కెరటమువల్ల దెబ్బతిన్న 75 చదరపు మైళ్ళ విస్తీర్ణములో చవుడు వేసుకున్న ప్రాంతమును శుభ్రము చేయవలెను. వెంటనే ఈ పని చేయని యెడల ఈ సంవత్సరము, వచ్చే సంవత్సరము కూడా పంటవుండదు. ఈ విషయము గురించి రివిన్యూ, ఇంజనీరింగు ఉద్యోగులతో చర్చించితిని. ఈవిషయము నీరు సప్లయి చేయుట గురించి పబ్లిక్ వర్క్సు మంత్రి ధనశేఖరములో ఉద్యోగులతో చర్చించెదరు. ప్రభుత్వము తక్షణ సహాయము వుత్తర్వు చేసెను. పని జరుగుచున్నది. పాకలు కట్టుకొనుటకు బీదవారికి వెదుళ్ళు, ఆకులు ఇచ్చుచున్నారు. నీటి పారుదల మార్గములు మరమ్మతు చేయబడుచున్నవి.

త్వరత్వరగా బాధిత ప్రజలు కోలుకొనుచుండుట ఎంతయు ముదావహము రైతులు, పల్లీలు కష్టపడి పనిచేయుచున్నారు. మిగిలిన దానిని సద్వినియోగము చేసుకొనుటకు కృషిచేయుచున్నారు. వున్నంతలో బీదవారు తెప్పరిల్లుకొనుటచూస్తే ఆశ్చర్యమేసినది. స్థానికులు, ప్రభుత్వము వారికి సహాయం చేయుచున్నవి మాన్యశ్రీ మదరాసు గవర్నరు తుపాను బాధితుల సహాయార్థము నిధిని ప్రారంభించియున్నారని మంత్రిగారనిరి.

## తుపానుబాధితులకు సహాయం

రాజమహేంద్రవరం, డిసెంబరు 3: తుపానుబాధితుల సహాయార్థం యీ పురపాలక సంఘంవారు వెయ్యి రూపాయలు, ఐ. యల్. టి. డి. కంపెనీవారు అయిదు వేల రూపాయలు, సోషలిస్టుపార్టీ వారు 670 రూ॥లు విరాళము లిచ్చిరి. ఈ సొమ్ము తాలూకా తుపాను బాధితుల సహాయక సంఘమునకు అందజేయబడెను.

(స్వ. వి.)

# "అవినీతికి బాధ్యులు అనధికారులే"

## కడపజిల్లాబోర్డు అధ్యక్షుడు పుల్లారెడ్డిగారి హెచ్చరిక

కడప, డిసెంబరు 3: లాభాలు ఆర్జించాలని ఆత్రుతపడే వర్తకులూ, బ్లాక్ మార్కెట్ వ్యాపారస్థులూ అధికారులను లంచగొండులుగా తయారు చేస్తున్నారని, ఈ అవినీతికి అధికారులకంటే నఅధికారులే ముఖ్యబాధ్యులనీ కడపజిల్లా బోర్డు అధ్యక్షుడు టి. పుల్లారెడ్డిగారు నేడు పులివెందులలో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ అన్నారు.

ఆహార ధాన్యాల ధరలను, గుడ్డ ధరలను తగ్గించ లేకపోవటానికి, లక్షలాది బీద ప్రజలకు ఆర్థిక సహాయం చెయ్యలేకపోవటానికి కారణాలేవైనా, తాము అధికారంలో ఉన్న కాలంలోనైనా పరిపాలనా విధానం నుండి అవినీతిని కడిగివేసి పవిత్రపరచకపోతే కాంగ్రెసువారు ప్రజల ముందు తలెత్తుకు తిరగటానికి గాని, వచ్చే ఎన్నికల్లో ఓట్లకోసం చేయిచాపటానికి కాని అర్హులు కారని కూడా, రెడ్డిగారు హెచ్చరించారు.

"పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ వంటి అత్యుత్తమశీలవంతులు ప్రభుత్వ నౌకను నడుపుతుండగా, అవినీతిపరులు సంఘాన్ని పట్టుకుని పీడించటం ఎన్నటికీ జరగదు; జరగరాదు. ఈ విషయంలో భారత ప్రధాని మార్గదర్శకులయ్యారు; తన మంత్రివర్గంలో ఒకరు ఒక విషయంలో అపమార్గాన ప్రవర్తించారని తెలిసీ తెలియగానే పండిట్ నెహ్రూ అతనిని పదభ్రష్టుని చేశారు. ఇతరులు కూడా ఇదేవిధంగా ధైర్యంతో ప్రవర్తిస్తే ఈ అవినీతిని నిర్మూలించటం కష్టం కాదు" అని పుల్లారెడ్డిగారన్నారు.

# తాతానగర్ ఆంధ్రాయూనియన్ సమావేశం

తాతానగరం, డిసెంబరు 1: తాతానగర్ ఆంధ్రాయూనియనువారు, యం. ఆర్. ప్రసాదుగారి అధ్యక్షతను సమావేశమై యీ క్రింది తీర్మానములను యేకగ్రీవముగా ఆమోదించిరి. గత మాసాంతమున ఆంధ్రకోస్తా జిల్లాలలో తుపానువల్ల గలిగిన అపారనష్టమువలన పలుకష్టములకు గురియైన తుఫానుబాధితులకు ప్రవాసాంధ్రులమగు యీ సభవారు సానుభూతిని తెలుపుచు, తుఫాను బాధితులకై వసూలు చేయు విరాళములను, అఖిల కాంగ్రెసు కార్యదర్శిగారైన కళా వెంకటరావుపంతులుగారికి పంపుటకై యేకగ్రీవముగ తీర్మానించిరి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు, నాయకత్రయ నివేదిక నామోదించి, సత్వర ఆంధ్రరాష్ట్ర ప్రాప్తికి అవకాశము కలిగించినరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులు రంగా గారికిని, ప్రకాశముపంతులు గారికిని, మిగిలిన, ఆంధ్ర రాయలసీమ నాయకులకును, తమఅభినందనములు అర్పించుచు, యెట్టి పరిస్థితులలోనైనను, మద్రాసునగరము తమిళనాడులో చేరకుండ, ప్రత్యేక రాజధానిగా వుండవలయునను నిశ్చితాభిప్రాయమును యీసభవారు సంపూర్ణముగా బలపరచుచున్నారు. రానున్న ఆంధ్రరాష్ట్రమునకు సరిహద్దు నిర్ణయసంఘ మేర్పడులోపునే, సరిహద్దు ప్రాంతములలో ముఖ్యముగా ఒరిస్సారాష్ట్ర సరిహద్దుప్రాంతములలోనక్రమముగా తాంధ్రరాష్ట్రములో చేరవలసిన ప్రదేశములందు జాగ్రత్తవహించి, వలసిన చారిత్రాత్మక, ప్రాంతీయభావ మొదలగు, ఆధారముల సేకరించి, సదరు ప్రదేశములను, ఆంధ్రరాష్ట్రములో చేరునట్లు తగుచర్యలు గైకొన యీ సభవారు, ప్రత్యేకముగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారినిన్నీ, ఆంధ్రమహాసభవారినిన్నీ కోరుచున్నారు.

ఈ తీర్మానముల కాపీని, ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షులకున్నూ, ఆంధ్రమహాసభ కార్యదర్శికిని పంపుటకు నిర్ణయించారు

# గుంటూరు సంగీత సమాజం

గుంటూరు, నవంబరు 30: కీర్తిశేషులైన కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు కర్ణాటక సంగీతానికి ఒనర్చినసేవకు స్మారకచిహ్నంగా యీ పట్టణంలో ఒక సంగీత సమాజ స్థాపనకు తీవ్రమైన కృషి జరుగుచున్నది. అనేక ప్రముఖులు అమితోత్సాహంతో సభ్యులుగా చేరుటకు అంగీకారాన్ని తెలియజేశారు. ఇప్పటికప్పుడే సుమారు వందమంది సభ్యులుగా చేరినట్లు తెలుస్తున్నది. ఇంకా అనేకమంది ఉత్సాహంతో చేరనున్నారు.

వచ్చే జనవరి నెలకల్లా సంగీత సమాజం సుస్థిరంగా ఏర్పాటయి ప్రథమ కచ్చేరి జరిగే ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. సభ్యుచందా ఆరు మాసములకు గు 20 లు. శ్రీ వింజమూరి శ్రీనివాసాచారిగారు యీ సంగీత సమాజ స్థాపనవిషయంలో రాత్రింపగళ్లు ఎంతో ఓపికతోను ఉత్సాహంతోను కృషిచేస్తున్నారు.

(స్వ. వి.)

# అనంతపురం పురపాలకసంఘసమావేశం

## నూతనవత్సర బడ్జెటు ఆమోదం

అనంతపురం, నవంబరు 30: అనంతపురం పురపాలకసంఘ ఆర్థికపరిస్థితి గత సంవత్సరములకంటె అభివృద్ధిచెంది అనేక క్రొత్త సౌకర్యములు కలిగించు అవకాశము కలిగినట్లు నిన్న జరిగిన బడ్జెటు సమావేశ చర్చవల్ల తేలినది. 1949-50 సం॥రపు సవరణబడ్జెటు, 1950-51 బడ్జెటు అంచనాలు, ఆర్థికసంఘ సవరణలతో ఏకగ్రీవముగా ఆమోదింపబడెను. సమావేశానికి అధ్యక్షులు పప్పూరి రామాచార్యులుగారు అధ్యక్షత వహించిరి. సవరణ బడ్జెటులో క్రొత్తగా ప్రారంభింపబడిన మాధ్యమిక పాఠశాల పరికరములకు 3600, శేషగిరిరావు సత్రమునకు 2450 దుమ్ముఠేగకుండా నీన్చుచల్లు లారీకొనుటకు 15,000 బస్ స్టాండులో ప్రయాణీకులకొరక భవనము కట్టుటకు 5 00, మురికి కాలువలకు 2000 పాయిఖానాలకు 2192 ఖర్చు చేయబడెను.

1950-51 బడ్జెటు అంచనాలలో ఇందులో స్వగృహములులేని మునిసిపల్ ఉద్యోగులందరికి గవర్నమెంటు రూల్సు మేరకు ఇంటిఅద్దెలు అలవెన్సు ఇచ్చుటకును, ఉపాధ్యాయులకు ప్రభుత్వపు స్కేళ్ళమేరకు జీతము లిచ్చుటకును, రజకుల లైసెన్సుఫీజు తగ్గించుటకును అంగీకరింపబడెను. తుపానుబాధిత సహాయనిధికి 301 రు. ల విరాళమిచ్చుటకు నిర్ణయించారు. మునిసిపల్ హైస్కూలులో సెక్రటేరియట్ తరగతులకు 1900, చేతి పరిశ్రమలభాగ భవననిర్మాణమునకు 4500, పరికరములకు 10,000 పౌరశిక్షణకు 2500 మిడిలుస్కూలు భవననిర్మాణమునకు 10,000. పోలీసు లైన్సు ఎలిమెంటరీ స్కూలు నిర్మాణమునకు 10,000 శారదా బాలికా పాఠశాల అభివృద్ధిచేసి మిడిల్ స్కూలుగా మార్చుటకు 4000, దక్షిణ స్కూలుకు 1500, ఎలిమెంటరీ స్కూళ్ళ పరికరములు కొనుటకు 10,000 మంజూరు చేయబడెను.

రాజాజీవీధి, పటేలువీధి, మాళవ్యా వీధి తారుచేయుటకు, క్రాసురోడ్లు కంకరవేయుటకు 31,000 న్ను పాయఖానాలు కట్టుటకు 8000. మురికికాలువలు కట్టించుటకు 5000, మార్కెటులో అంగళ్ళు కట్టుటకు 10,000, బీదల ధర్మసత్రమునకు ఆరువేలు అంచనా అంగీకరింపబడెను.

(స్వ. వి.)

# కర్నూలు జిల్లా వైద్య సంఘ వార్షిక సభ

కర్నూలు, డిసెంబర్ 2:— మొన్న సాయంత్రం ఇక్కడ కర్నూలు జిల్లా వైద్యసంఘ వార్షిక సమావేశం జరిగింది. జిల్లా అన్ని ప్రాంతములనుండి వైద్యులు సభకు హాజరయ్యారు.

కర్నూలు డి. ఎమ్. ఓ. డా॥ ఆర్. షణ్ముగం పిళ్ళగారు మాట్లాడుతూ రాయలసీమలో క్షయరోగం, వారిడకురుపులరోగం ప్రబలిపోతున్నవని, వీటిని నివారించుటకు ప్రజల్లో విజ్ఞానం వ్యాప్తి చెయ్యాలని, వైద్యవృత్తిలో నున్నవారు ఇందుకై సర్వవిధ ప్రయత్నం చెయ్యాలనీ ఉద్బోధించారు.

డా॥ శ్రీనివాసరెడ్డిగారు వార్షిక నివేదికను చదివినపిమ్మట డా॥ జి. బాలసుబ్బయ్యగారు, డా॥ ఎమ్ బాపిరాజుగారు ఉపన్యాసా లిచ్చారు.

తరువాత స్థానిక సంస్థల ఆస్పత్రులలో పనిచేయు వైద్యులకు ప్రభుత్వ ఆస్పత్రులలోని వైద్యులతో సమానమైన హోదా కలిగించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

నూత్న సంవత్సరానికి డా॥ ఆర్. షణ్ముగం పిళ్ళ అధ్యక్షుడుగాను, డా॥ శ్రీనివాసరెడ్డి కార్యదర్శిగాను, మరొక 7 గురు కార్యవర్గ సభ్యులుగాను ఎన్నుకోబడ్డారు. (స్వ. వి.)

# గుడివాడ కేంద్ర ఉపాధ్యాయ సంఘసమావేశం

గుడివాడ, నవంబర్ 30: ఈ కేంద్ర ఉపాధ్యాయ సంఘ సమావేశం స్కూళ్ళ జూనియర్ ఇన్‌స్పెక్టర్ పి. చిరంజీవరావు అధ్యక్షతను జరిగింది. తుపానువల్ల పాఠశాలనడుపుటకు వీలు లేక మూసివేసిన దినములు, మొత్తం పనిచేయవలసిన దినములనుంచి తగ్గించవలసిందిగా ప్రభుత్వమును కోరుతూ తీర్మానించారు. అందరితోపాటు ఉపాధ్యాయులకు కూడ ఒక నెల జీతమును కరువు భత్యంతో సహా యిప్పించవలసిందని కోరారు.

## కాంగ్రెస్ అభ్యర్థి విజయం

కృష్ణాజిల్లా స్థానిక సంస్థలతరఫున సెనేటుకు కాంగ్రెస్ అభ్యర్థిగా శ్రీ ఇమాన్యుయల్ గారు పోటీ చేశారు. వీరు 108 ఓట్ల మెజారిటీతో గెలిచిరని తెలియవచ్చింది. స్వ. వి.

# ఆంధ్రతమిళ విభజన అవశ్యకత

## ఆంధ్ర స్వరాజ్యపార్టీ తీర్మానములు

విజయవాడ, డిసెంబరు 3: సత్వరమే చెన్నరాష్ట్ర ప్రభుత్వము ఆంధ్ర తమిళ ప్రాంత విభజనసంఘమును సర్వపక్ష ప్రాతినిధ్యముతో నియమించవలెనని కోరుచూ నిన్న మొన్న ఇచట గుమ్మిడిదల వెంకట సుబ్బారావుగారి అధ్యక్షతక్రింద సమావేశమయిన ఆంధ్రస్వరాజ్యపార్టీ కార్యవర్గము తీర్మానం చేసినది.

స్వరాజ్యపార్టీ కార్యవర్గము వారు క్రొత్త రాజ్యాంగచట్టముపట్ల తమ ఆనందమును తెల్పుచూ, రాష్ట్రముల జాబితాలో ఆంధ్రరాష్ట్రమును చేర్చకుండుట శోచనీయమని తీర్మానించిరి.

రాష్ట్ర ముఖ్యపట్టణము శ్రీబాగ్ ఒడంబడిక కనుగుణముగా ఏర్పాటు కావలెననియు, బళ్లారిజిల్లాలోని కన్నడతాలూకాలను అచటి నాయకుల ఇష్టప్రకారము ఆంధ్రరాష్ట్రమునకు లేక బొంబాయి రాష్ట్రమునకు చేర్చవలెననికూడా తీర్మానించిరి.

కాంగ్రెసు సంస్థ వివిధ దృక్పథములకు ప్రాతినిధ్యము వహించు "సర్వ ప్రజాభిప్రాయప్రకటన వేదిక"గా నుండక, ఒక సుస్పష్ట రాజకీయవర్గముగానుండి పోవ తీర్మానించినది కాన, ఒక శక్తివంతమైన సక్రమ ప్రతిపక్షసంస్థ బయలుదేరుట అత్యావశ్యమని సూచించుచూ మరొక తీర్మానము చేసిరి. (స్వ. వి.)

# కమ్యూనిస్టు ఖైదీ మరణము

విజయవాడ, డిసెంబరు 3: గతరాత్రి యలమంచిలి వెంకటేశ్వరరావు అను కమ్యూనిస్టు ఖైదీ విజయవాడ సబ్ జైలులో, క్షయ వ్యాధిచే మరణించెను. గన్నవరంతాలూకాకు చెందిన ఆత్కూరు గ్రామములో 1946 సంవత్సరములో ఇరువురు కాంగ్రెసువాదులను హత్యచేసినన్న నేరముపై విచారింపబడిన ఏడుగురు నిందితులలో వెంకటేశ్వరరావు ఒకడు: బందరు సెషన్సుజడ్జి, వెంకటేశ్వరరావుకు ఏడు సంవత్సరములు కఠినశిక్ష విధించెను. ఆదుపరి సెషన్సుజడ్జి తీర్పును పునర్విమర్శ చేయవలసినదిగా హైకోర్టుకు వెంకటేశ్వరరావు విన్నవించగా, శిక్ష ఐదేండ్లు చేయబడెను. అపైన నవంబరు 28 న వెంకటేశ్వరరావును విజయవాడ పోలీసులు అరెస్టు చేసి, స్థానిక సబ్ జైలులో నుంచిరి. సెంట్రల్ జైలుకు తీసికొనిపోవులోగా వెంకటేశ్వరరావు మరణించెను. (స్వ. వి)

# పశ్చిమగోదావరి కాంగ్రెసు వ్యవహారములు

విజయవాడ, డిసెంబరు 3: పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు వ్యవహారములపై విచారణ చేయుటకు రాష్ట్రకాంగ్రెసు నియమించిన సంఘమునుండి ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు రాజీనామా ఇచ్చుటవలన వారిస్థానే రాష్ట్రకాంగ్రెసువారు భోగరాజు బుచ్చిరామయ్యగారిని నియమించిరి. విచారణ విజయవాడలో, రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమునందు డిసెంబర్ 11 నుంచి ప్రారంభమగునని తెలుస్తున్నది. (స్వ. వి)

# చవిటి పర్రల్లో కూడావరిపైర్లు

## బందరువద్ద వ్యవసాయ శాఖవారి పరిశోధనలు

బందరు, డిసెంబరు 2: ఉప్పుబారిన చవిటి పర్రలలో కూడా మొలకెత్తి ఫలించగల వడ్లరకాలను ఉత్పత్తి చేయటానికి బందరువద్ద ఒక వరిక్షేత్రమును ప్రారంభించాలని వ్యవసాయ శాఖ వారాలోచిస్తున్నారని తెలుస్తున్నది. కోస్తాప్రాంతంలో నిరుపయోగంగా పడివున్న సువిశాలమైన భూములలో ఈ రకమైన విత్తులు జల్లి సాగుచు తీసుకురావాలని వారు ఆలోచిస్తున్నారట. ఈ భూములకు జలాధారం కూడా బాగా అందుబాటులో ఉన్నది. వ్యవసాయశాఖవారు అప్పుడే ఒకరకం విత్తులను పంచిపెట్టారని, ఈప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయనీ, వరిక్షేత్రస్థాపనకోసం వారొక ప్రత్యేకాధికారిని త్వరలో నియమింపనున్నారని కూడా తెలుస్తున్నది.

## వివాహము

తిరుమల తిరుపతి దేవస్థానం కమిషనర్ శ్రీ వి. వీరాస్వామినాయుడు గారికుమార్తె చి. వి. గజపతికి సౌ. చంద్రమ్మ, చి॥ వి. భక్తవత్సలమునకు సౌ. రామతిలకమును ఇచ్చి నేటితెనం తిరుచానూరులో వివాహము వైభవంగా జరుపబడింది. ప్రముఖులనేకమంది హాజరై వధూవరుల నాశీర్వదించిరి. (స్వ వి.)



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.